# హితోపదేశములు

## మిత్రలాభము



గ్రంథకర్త

వెంపటి కుటుంబయ్యా శాస్త్రి

పెదకళ్లేపల్లి

సం.]

[దీనివెల 4 అణాలు.

# విజ్ఞప్తి

ర్యులారా!

ఈమిత్రలాభమును చిన్నయసూరి హితోపదేశమునుండి తెలిగించెను. దానిని నేను దైవయోగముచే 1921 సం॥ర మందు లభించిన సెంథోం హైస్కూల్ తెలుగుపండితపదవి గల నాఁడనై పఠియింపంజేసితి. అట్టియెడ నాగ్రంథాదిని చిన్నయ సూరి వ్రాసిన రెండుపద్యములలో మొదటిదిగాక రెండవదియగు,

క. పలుసందియములఁ దోలఁచును
వెలయించు నగోచరార్థవిజ్ఞానము లో
కుల కక్షి శాస్త్ర మయ్యది
యలవడ దెవ్వానికి వాఁడె యంధుఁడు జగతిన్.

అను పద్యమున కర్థవివరణమందు, లో, కులకక్షి శాస్త్ర విభాగము చేసి కౌలశాస్త్రమని వక్కాణించితిని. రెండ మరువత్సరమున మహారాజశ్రీ తిరువళిక్కేణి హిందూ హైస్కూల్ (కార్యదర్శిగా రగు గుమ్మడి రంగారావుగారివలన లిగిన తెలుఁగుపండిత పదవియందుగూడ నిటులె నుడివితి. అట్టిసమయమున నందుండుమజీయొకయుపాధ్యాయులు హితోపదేశశ్లోకమునకు సరియైనదిగాన నటులు గాదని నుడివిరి. వారు వక్కాణించిన లోకులకు అక్షి శాస్త్రము అను విభాగమందు నీయర్థమే సమర్థనీయముగా నున్నది. ప్రకరణము ననుసరింపవలయుగాన, భోజనకాలమున సైంధవము దెమ్మనిన గుఱ్ఱముం దెచ్చుట కాదు. కాన రాజకుమారులకు రాజనీతిం జెప్పు ప్రకరణముగాన కులకక్షి శాస్త్రంబనియే చెప్పనగును. మహారాజశ్రీ, శ్రీ రంగారావుగారి మహిమ మెట్టిదనిన,

గీ. వేల్పు కెప్పుడు నిచ్చుట వెలయఁ గరము
మనుజరూపుననే కాని మఱియు నెట్లు
దాన మనుజుఁడు గార్యము దలఁపనగును
వాఁడె వేల్పని భువిలోన వాడుక యగు.

గీ. రంగనాథుఁడె భువిఁ గార్యరాజిఁ గనును
రంగరావును విద్యల రాజిఁ గనును
దాన నీతఁడె యాతఁడం దలఁపు గదురఁ
బండితాళియు వీనితోఁ బ్రబలియుండ్రు.

గీ. భేదలందున వాతఁ డభేద మొందు
దానిఁ దెలిసియు నీతఁడు దాని జరుపఁ
నెటులు పెందఁ డభేదము వీనితోడఁ
జేరు నట్లులు గూడెఁగా భేద మెట్లు.

ఏతత్పదవికి ఋణాతీర్మానమను నా వ్యావహారిక ప్రవృత్తియే భంగకర మాయెను. పిమ్మట శివకేశవులో యన నొప్పు కాశీనాథుని నాగేశ్వరరావుగారు గుమ్మడి రంగారావుగారు నను నిరువురిలో శివసదృశులై శాంత్యాదిసద్గుణగరిష్ఠు లగుచు "పరోపకారార్థ మిదంశరీర" మను న్యాయమున కాకరులైన నాగేశ్వరరావుగారి యనుగ్రహముచే నాంధ్రపత్రికాలయమందు వేతనముంగొని జీవించుచు నీ గ్రంథమును వారి ద్రవ్యసహాయముచే ముద్రింపించితిని. దీనిని సహృదయులగు మహాత్ములు తప్పులు మన్నించి యొప్పులను గ్రహింతురు గాక.

గీ. పద్యముల వ్రాయ నిదియె మున్నుద్యమంబ
పద్యముగ నున్న బుధు లనవద్య మనుచు
మద్యమింతుకు చదువ నీపద్యసమితిఁ
నుద్యమింపఁడె తల నంకి నూన శివుఁడు.

విధేయుఁడు,

వెంపటి కుటుంబయ్యశాస్త్రి.

# పీ ఠి క

ఆయ్యా!

ఈమిత్రలాభమునందు కాక, మూషిక, మృగ, కపోత కూర్మముల నాదరించినకతంబును తెలుపుదును. ఈపంచక మును గ్రహించుటలో కాకమునకు లఘుపతనక మనియు మూషికమునకు హిరణ్యక మనియు మృగమునకు చిత్రాంగుఁ డనియు కపోతమునకు చిత్రగ్రీవమనియు కూర్మమునకు మంథ రమనియు, నామంబు లిడియున్నవి. అందు కపోతచర్యయందు చిత్రగ్రీవుఁడు చెప్పిన పలుకులకు ప్రతికూలముగా నన్యవృద్ధ కపోత మొండు నటించి వలను చిక్కుపడి యనంతర మీ చిత్రగ్రీవునియుపాయమువలన వదలెనను కథ యొండు గలదు. దీనిని బట్టి చూడ జీవుండు తన కవినాభావసంబంధము గల జీవుఁడు ముదికపోతమునంటి యితరమగు ప్రాణాదివాయురూపు లగు కపోతములతోఁగూడ లింగదేహముం దాల్చి కర్మవశ మున మహాకాశసంచారులగునప్పుడు స్థూలదేహప్రవేశమందు కారణమగుకర్మవ్యాధుండు దేహావృక్షంబున కర్మసూత్రంబు పన్ని పొంచియుండఁ గని కర్మవశమున నచ్చటియాహారమం దాసక్తిఁ దగిలి యావలయందుఁ జిక్కి, పశ్చాత్తాపంబు నొంద

వానికర్మగతిని దెలిసిన చిత్రగ్రీవుం డనునీశ్వరుండు నావలను దప్పించి వారివారిస్థానములం జేర్ప గణనాథునివాహన మగు నెలుక యరణ్యమున నుండ నచ్చటికిం దోడ్కొనిపోయినటులు దోంచుచున్నది. ఒకపత్తనమునం బ్రవేశించినజనుండు ప్రప్రథమమున తనకు స్థిరత చిక్కక చంచలుండై యున్నటులు, ఈ జీవుండును దేహపురప్రవేశమునకు ప్రథమమున స్థిరతకై మిత్రలాభముం గోరియుండ నీశ్వరుండు మూషికముం జూపెను. ఇది బాల్యమందుండునట్టియవస్థ. మార్గమున ప్రయాసను జెంది పత్తనముం జేరిన ప్రవాసకుని పత్తనాధ్యక్షునిసంబంధు లగువార లెట్లు స్థానప్రదర్శనంబుం జేయుదు రట్లే దేహపురాధ్యక్షుం డగు గణనాథునివాహనం బగునెలుక యీకపోతముల విడిపింపంగా వానియధ్యక్షుండగు చిత్రగ్రీవుండనునీశ్వరుండు వాని వానిస్థానములం జేర్చెననుట. కనుకనే ప్రతికర్మాదియందు గణనాథపూజన మావశ్యకము. ఈతండు పసుపుచేం జేయంబడుటకు సత్త్వమునుండి రజోగుణముం జేరుటకు ముందు గలుగు పసుపురం గీతనిద్దియై యుండు. దీనిని దీపారాధనం జేయువారు దీపస్వభావముం బరికించినం దెలియును. దీపారాధనఫల మిదియే. పిమ్మట నాచిత్రగ్రీవాదులు వలను జిక్కిన స్థానమునుండి వల నెత్తుకొనిపోవుతఱిని వాని వెంబడించి కాక మొండు చనినట్లును, ఆకాకము నాయెలుకకపోతములకుం జేసినయుపకృతిం గని యీతం డుపకారార్థుం డని మైత్రిం

గోరఁ బోవ నాహిరణ్యాక్షుం డీతనిశత్రుత్వముఁ దలఁచి యతి భయభ్రాంతుఁడై యలుఁగు జొచ్చి యుండ నీతం డతనిభయ ముం దీర్చి స్నేహ మతిబలవంతముగా నొసఁగి కొంతకాల మచట నుండి పిదప నాహారమునకు కష్టమను సాకుచేఁ గూర్మ ముఁండు మడువుం జేర్చెనను కథను బట్టి చూడఁగా జఠరముఁ జేరుశబలరక్తమును శుద్ధిచేయుటకై హృద్యంత్రముఁ జేర్చు టలో నతిశీఘ్రగతిగల కాకినీరూపధారిణీ యను నామోక్తం బగు కాకిని యనునాడి హృదయమునుండి మణిపూర మనుపృథి వ్యాత్మకచక్ర సమీపమున నుండురసదళ మను రసాత్మకమగు నాభియనుమడువునకు నాధారభూతుండగుసీమెలుకను జేర్చి మం దగతిగలిగి జలములువిడిచి కదలలేనికూర్మమున గొప్పగించినం దున నాధారకూర్మముల నొకటిచేసి స్థాపించి యీయిరువురితో గలసి కాకిని యను నాడి యున్నట్లును దోఁచుచున్నది. ఇందు వలననే లింగమును కూర్మచక్రముఁ దాధారపఱచి హిరణ్యా దుల నుంచుటయు కాకమునకు ముఖ్యముగా బలినిచ్చుటయు దానిని శకున మడుగుటయు వాడుకగా నేర్పడినది. అట్లవి మూఁడు నాధారమునకుఁ జేరినపిమ్మట నామడువునొద్దకుఁ జింక యొకండు వ్యాధునిచేఁ దఱుమఁబడి వచ్చి చేరి వీనిస్నేహ మును సంపాదించి యామడువు నొడ్డున చెట్లనీడల నాశ్ర యించి బీండ్లకుఁ బోవుచు వచ్చుచు నుండెను. ఇట్లుండ నొక నాఁడు బీటి కేగి యచట వ్యాధువలలోఁ జిక్కి విలపించు

చుండెను. ఇట్లుండి నిత్యమును వచ్చుతఱికి జింక రాకయుండు టకుఁ గూర్మము జింతిలి కాకమును పంపెను. అది పోయి దానియునికిఁ గని తిరిగి మడుగుఁ జేరి, మడుగునొద్దనుండు నెలుకం గొనిపోయి వానిబంధము దప్పించి మరలివచ్చుచుండ నావ్యాధుఁడు వలలోఁ జిక్కినమృగముం గానక వెదకుచు నడుగుల జాడఁ బట్టి వచ్చుచుండఁగా జింక రాలేదను తొందరతో నెదురేగు కూర్మము వానిచేతఁ జిక్కెను. వానిఁ దప్పించుట కుపాయంబును కాకము పన్ని తప్పించి నాల్గును స్వస్థానముం జేరెను. దీనికి తాత్పర్యముగా నాకాకి సీనాడితోఁ గూడ నాధారమనుస్వస్థానమును గణనాథునివాహనముఁ జేరి యచ్చట కూర్మమను కూర్మచక్రము నాశ్రయించి యుండఁగా చాంచల్యగుణముచే మనసువంటిదగు లేడి యచ్చట చేరి ఈ మూఁటి యాధారమునను మడువను నాభిస్థానముఁ జేరి పిదప నింద్రియాటవులను బీండ్లఁ బచ్చిక మేయుటకు వచ్చుచుఁ దిరుగ నాధారముం జేరుచుండెను. ఇట్లుండ నొకప్పు డాధారముం జేరక ప్రవృత్తియందే యుండఁగా కాకిసీద్వారమున నాధారాధీశుని వాహనమగు నెలుక యేఁగి వానిబంధమునుండి తప్పించి యాధారముం జేర్చెను. ఇట్టిమిత్రలాభ మనునది మనుజుని బాల్యవృత్తాంతము. పిమ్మట మిత్రభేద మనునది యౌవనవృత్తాంత మగును. అప్పటికి హృదయ మేర్పడు ననఁగా గట్టిపడును. ఇదియే మిత్రభేదతాత్పర్యము. దానిని ముందువివరించెదను.

మొదట కపోతములలోఁ జిత్రగ్రీవుం డను నీశ్వరుండు సంసారము పులివంటిదని సూచించుటకై పులికథను జెప్పె. పిమ్మట వ్యోమమందుకూడ సంచారముగల కాకము తనను నమ్మించుటకై యెలుకయొద్ద జింక నక్కచేఁ బడినఁ చిక్కుల నుగ్గడించుటచే నీసంసారమున నతిమెలఁకువతో మెలంగుట యుక్తమని చెప్పెను. ఆనక్క కామమునకు తుల్యమైనది. ముసలిగ్రద్ద పక్షులఁ గాచుచుండఁగాఁ బిల్లి వాని మోసపుచ్చి పులుఁగుబిడ్డల నలిమి చంపెనను కథవలన నీసంసరమం దిట్టి క్రూరత గలదనియు నెవరిని నమ్మరాదని యెలుక నుడివెను. యమనియమాదులచే పరివ్రాజకు లాధారమునందుండు తేజము నరణ్యమను నుత్తరమార్గమునకు వెడలఁగొట్టుట గలదు గాన నది ననిమిత్తకం బయ్యె. పిమ్మటఁ గూర్మమునొద్ద జింక చెప్పినవృత్తాంతము తాను కళేబరభేదముచే ననుభవించిన వృత్తాంత మగును.

పిదపఁ బందికై యాశించి వ్యాధుండును వానినలుగుడులకు నలిగినపామును మడిసియుండ నామాంసమున కాశించి దరి చేరిన నక్క విల్లుదెబ్బచే జచ్చెనను కథవలన

నక్కఁ దిన్నవాఁడు గురులింగజంగంబు
పందిఁ దిన్నవాఁడు పరమయోగి
యేనుఁగఁ దిన్నవాఁ డెంతసుజ్ఞానిరా
విశ్వదాభిరామ వినుర వేమ.

అనునార్యోక్తిచే లోభము పందివంటిదిగాన దాని విడనాడవలయుననియు, సర్పము కుండలిని యనియుఁ దోఁచుచున్నది. నక్కకథ కామ్యములు గూడవని సూచించుచున్నది. ధనుస్సు చెదరి యానక్క చచ్చెనని చెప్పుటచే కామ్యముల వలన మనోరూపేక్షుకోదండాయును నామోక్తంబగు కోదండ రూపమగుమనము చెదరి యపాయమగునని సూచించుచున్నది.

ఎలుక చెప్పినగాథ వైరాగ్యమును సూచించుచున్నది. పిమ్మట మృగమును వలనుండి కాకమూషికములు వదలించె ననుకథచే మనంబున కప్పుడప్పుడు గలుగు కామాదిబంధములను నీపురాధ్యక్షునివాహనముగు నెలుక కాకినీద్వారమునఁ బోయి వదలించె నని సూచింపఁబడినది. ఇట్లు వ్యంగ్యార్థముఁ "జీవితం వ్యంగ్యవైభవం" అను నార్యోక్తిచేఁ గావ్యమునకు గౌరవం బొసంగును. కాన నీయర్థము నీపీఠికయం దింతవఱకుఁ జూపి గ్రంథవిస్తరభీతిచే విరమించితిని. ఇది పంచతంత్రములోనిది గాన తంత్రమున కీయర్థము తగియేయుండును.

ఇట్లు,

వెం॥ కు॥ శాస్త్రి

# హితోపదేశములు

## మిత్రలాభము

### గణనాథధ్యానము

గీ. బొజ్జ యుండ్రాళ్ల మిక్కిలి బూరడింప
మెక్కి సొక్కుచుఁ బూజల మెలఁగుచుండ
జూచి నవ్వినశశి శాపజుష్టుఁ జేయు
తిండిపోతును మదిఁ గడితేరఁ గొల్తు. ౧

### ఈశస్తుతి

గీ. అగ్గినిడికొని లాలాటయంత్రమందు
నగ్గలంబుగ రవిచంద్రు లనెడివెండి
దువ్వెనలఁ జేసి తనదుచేతులను బట్టి
ధరణికాంతకుఁ జీకటికురులు దువ్వి. ౨

గీ. వెనుకఁ గొప్పును సవరించి వెలుఁగురిక్క
పూల నుంచిన శివరూపుఁ బూజసేతు
భువిని జనులకుఁ గాలంబుఁ బొడుగుచేసి
మదినిఁ గోర్కులు దీర్చుచు మసలుగాత. ౩

### అంబాస్తవము

గీ. భండరక్కసుఁ జెండి ప్రచండమహిమ
నిండి జగములఁ గీర్తిచే యండయైన

లలిత యను పేరఁ బరఁగిన లలన కెపుడు
ప్రాజ సత్పద మానస పుష్పవిధిగ ౪

## కవి స్తుతి

క. కబ్బము లను కంబంబుల, నిబ్బరముగఁ బాతి కీర్తి నిజపుటగృహముల్
దబ్బర లేకయు వాణికి, నుబ్బుచు నిర్మించు కవుల నూనెద మదిలోన్.

## సరస్వతీస్తుతి

క. శ్రీమానసాబ్జప్రియహం, సామోదముఁ దనిసి కనఁగ సన్మానసప
ద్మామోదమొందు వాణిన్, నామానసపద్మసద్మ నాటి భజింతున్. ౬

## కథాప్రారంభము

క. శ్రీభాగీరథియొడ్డున, శోభం దనరారు దివ్యసుఖసంయుతమై
యీభువిఁ గేరుం ద్విజరా, జాభాజాలంపుశోభ సంద్రముఁ జదలుల్

సీ. పాటలీపుత్త్రమన్ పత్తనం బలరారు
నాపత్తనంబున నార్యనుతుఁడు
నాకాళపాదుని హస్తసుదర్శన
మనఁగఁ జాలు సుదర్శ నాఖ్యుఁ డచట
పాలించుఁ బ్రజలను బరమానురాగత
భూదేవదేవతాపూజ తనర
నతఁ డొకనాఁ డట్టహాసముతోఁ బండి
తాళితో సల్లాప మాడుచుండ

గీ. కోవిదుం డొక్కఁ డాతేనికొల్వుఁ జేరి
స్వామిభావంబు నరయమి జవ్వనంబు
కలిమి యను వీనియం దొంటఁ గలుగుఁ జేటు
నాల్గు కల్గినఁ జెప్పంగ నలువవశమె.

క. అని ప్రస్తావనఁ జేసిన, విని యావాక్యములను నృప వీరుఁడు కడఁకన్
తనకొమరుల నతిమూర్ఖుల మనమునఁ దలపోసి దుఃఖమగ్నుం డగుచున్.

క. జననీజనకులవాకుల,
ననయత వినుచుండి చదువుఁ జదివినవాఁడే
ఘనుఁడని పొగడుదు రిలలో,
ననఘుతఁ బరలోకసౌఖ్య మనయము చెందున్.

గీ. గులకతా లెన్ని కలిగిన గుణము లేదు
రతన మొక్కటి యైన విలాస మొందు
గులము కెప్పుడు మొఱకులగుమియు నేల
గాన సత్పుత్త్రికుండు ప్రకాశకరుఁడు.

శీ. పిన్నతనమునఁ జదువు సెప్పించకున్న
జననిజనకులతప్పు లై చనును భువిని
ఘనతఁ జదివినకొమరులఁ గన్నజనని
జననియే కాని గొడ్రాలు జడునిఁ గనిన. ౧౧

క. సింగంబువోలు మెకములు
పొంగుచు గుహ డాఁగియున్న పొందునె? నరుఁడు
త్తుంగపుజతనము మాన నొ
సంగునె కోరికలు శుభము శతగుణిక్కై నన్. ౧౨

క. అని కొంతతడవు మనమునఁ, గనలుచు సభఁ జూచి పలికెఁ గార్యజ్ఞులు మీ
రనయుల మాతనయులఁ గని, సనయులఁ జేయంగ నేరు సాహసు లనుచున్.

క. అని పలుక రాజసత్తముఁ, డనఘుఁడు నావిష్ణుశర్మ యనునాతండున్
ఘనతం గొలువున నిలిచియు, వనటం దీర్పంగఁ బలికె వానికి నపుడే. ౧౪

సీ. ఓరాజచంద్రమ! యోగుణనిధి! నీకు
మారులఁ జదివింప మాకు సులభ

మెచ్చోట రతనంబొ యచ్చోటఁ గాచంబు
పుట్టదు భువిలోనఁ బుణ్యచరిత!
సరిరాదు సభలలో సానపెట్టక యొప్పు
చిలుకకుఁ బలుకులు సెలఁగుఁ గాని
బకమున కొప్పునె! బంగారు గరఁగిన
ట్లిను మది గరఁగునె యిల నధీశ!

గీ. ఆఱునెలలకుఁ జదువుల నంపఁగలను
నాదుభారంబు వీరలసాదుతనము
ననుచుఁ బలుకంగ నాభూపుఁ డలరి యనియె
విప్రునకుఁ గొల్ప వీనుల విందు మిగుల. ౧౫

గీ. పూవు గ్రుచ్చిననారకుఁ దావి గల్గు
సజ్జనునిఁ జేరఁ గలుగును సాధుతనము
గాన వీరలగుణముల కనువు గాఁగఁ
జేయ మీభారమే యంచుఁ జెప్పె విభుఁడు॥ ౧౬

గీ. కన్నతెఱవనికూనలు గాన వీరి
జదువుఁ జదివించి చక్కఁగ సాకవయ్య
మీఁదిభారంబు వీరిది మీది గనుక
ప్రాజ్ఞులను జేయుఁ డీ పుత్త్రప్రాయు లగుట. ౧౭

ద్వి. అని పుత్త్రులను పాఱు కప్పాడె చూపి
ఘనమతితో వానిఁ గైకొను మనియె.
అంతట బ్రాహ్మణుం డారాజునగరు
చింతఁ దీర్పఁగ మది శీఘ్రంబ యేగె. ౧౮

గీ. ఏగి యచ్చట నొక్కచో నినునిసుతుల
ముదము గదురఁగఁ గూర్చుండ ముదలఁ జేసి

సంధివిగ్రహములు మైత్రిసంధిభేద
ములను నాల్గునంశల పుటుకఁ దెలిపె. ౨౦

గీ. రాజసుతులార! మీరలు రహి వహించి
మిత్త్రలాభంబుఁ జాలఁగ మైత్రి వినుఁడు
కాకి యెలుకయు మెకమును గలిసి మిగుల
కూర్మమందున మైత్రిని గొనినవిధము. ౨౧

గీ. అనిన గుణవంతులై వార లనిరి విష్ణు
శర్మఁ జూచియు "నాకథ చవులు పుట్టఁ
దెలుపుఁ డిప్పుడె మనములు దేటపడఁగ"
ననఁగ వేగమె యాతండు నదియుఁ దెలిపె. ౨౨

క. పక్షులకును నిలయంబౌ
వృక్షము గల దొకటి వినిరె హీనుల గోదా
కక్షమునను బూరుగు నా
లక్షులు గా నచ్చో నుండు రాత్రులఁ బక్షుల్. ౨౩

క. అచ్చో టెలం బక్షులు
వచ్చియుఁ దమగూండ్లఁ జొచ్చి వసియింప నహో
చొచ్చి కిరాతుం డొక్కఁడు
నచ్చట నాపక్షిచయము లఱఁగుట కనియెన్. ౨౪

క. కాకం బొక్కఁడు గని యది
పాపవ నీతనిముఖంబు వీక్షించిననా
కేకీడు మూఁడు నొక్కొ
తేఁకువ వాటిల్లె విడుతుఁ దెంపున నిరవున్. ౨౫

క. అని వాయసంబు మనమున
ఘనముగ నాలోచనంబు గదురఁగ నచ్చో

వసటం బొందుచు నుండెన్
ఘనులకుఁ గాఁగల్గుచేత గననగు మున్నే. ౧౬

క. ఆకొని బోయం డప్పు డ
నోకహమును మఱుఁగుఁ జొచ్చి యొదిగి కుమతితో
నూకలఁ జల్లియుఁ జేరువ
నేకాగ్రతఁ బొంది నిలిచె నీసు దలిర్పన్. ౧౭

క. చిత్రగ్రీవుఁడు పారా
వతములకును రాజు నింగిఁ బఱచుచు నంతన్
సూత్రము నూకలుఁ జూచియు
చిత్ర మిదేమో యటంచుఁ జిత్త మలరఁగాన్. ౧౮

ఆ. తృష్ణఁ జెందఁగూడ దిట నని తలపోసి
తొల్లి బాటసారి త్రోవఁ గంక
ణమును గోరె దాన నడుమనె మడిసె నన్
కథను దెలిపెఁ దనదు గమియు వినఁగ ౧౯

సీ. ముదుసలిపులి త్రుంగి ముదమునఁ గొలనులో
కటకము చేఁబూని తటమునందు
నిలిచి తాఁ దెరువరి వలను బోవఁగఁ జూచి
యోపాంథ! యిచ్చెద నుత్తమంపు
వలయంబు గొను మిదె వారి త్రుంగు మనంగ
నాశచేఁ గనకంపుహాటకమున
నాభాగ్యమ పులివి నమ్మెద నెట్లన
జవ్వనమున నాల జనులఁ జంపి

గీ. క్రూరతను గల్గి గ్రుమ్మరు క్రూరమతిని
గాన మడిసెను బోటియుఁ గాను పిపుడు

పుణ్యనరుఁ డొక్కఁ డిచ్చిన ముదలచేత
దాని మానియు సేమంబు బూనియుంటి. ౩౦

క. ఇది గొను మీవు డీమడువున
నుదకములోఁ గ్రుంగి వేగ నో ద్విజవర్యా
పదమల యనఁ బెబ్బులి దా
ముద మందెను నేగిఁ గనక గ్రుక్కడిపగిదిన్. ౩౧

ఆ. కాన మానవుండు గాలవశతను దా
జ్ఞానియైన నేగిఁ గానకుండు
మూర్ఖుఁ డెట్టులు దెలియు మునునేగికారణ
మపుడె క్రుంక నేగె నాసకతన. ౩౨

క. మునుఁగుడు నామడుఁగున మొల
మునుఁగందగు బురదలోన మునిఁగినకతనన్
మనమున దిగులొందినవి
ప్రునికడకుం బులియు నేగెఁ బొంగుచు మదిలోన్. ౩౩

ఆ. విప్ర! చొచ్చి తీవు వేగముతో మొల
బంటిబురదలోన భయముపడకు
లేవనైతెద నని లేనగవునఁ బులి
పోన మాంస మంత మెక్కఁ దొణఁగె. ౩౪

ద్వి. అప్పు డావిప్రుండు నది గని మిగుల
చొప్పు తెలియక నేఁ జొచ్చితి ననుచు. ౩౫

ఆ. అయ్యొ క్రూరపుపులి నహహ నమ్మినవాఁడ
నమ్మరాదు దాన నాశ మయ్యె
నమ్మఁదగనివాని నమ్మినవానికి
మోస మగునుగాని కాసు లేదు. ౩౬

క. అని మదిఁ దలపోయఁగ నా
యనఘుం డగువిప్రుఁ బులియు నపుడె దినె వెసన్
ఘనుఁడైనఁ గాలవశతను
గను నీమలచేతఁ జిక్కి కాలునిలవున్. ౩౭

క. అరయమి సేపని కైనం
జొరరా దిలఁ జొచ్చె నేని చూడమిచేఁ దాఁ
బరిభవ మొందుం ధరలో
నరయమి బహుదోష మనుచు నాడిరి విబుధుల్. ౩౮

క. అది విని యన్యకపోతము
పదువుం గని పలికె నపుడె పామరులారా!
ముదుసలిమాటల వినకుఁడు
వదలందగ దెప్పు డెదుర వచ్చినదానిన్. ౩౯

క. స్థానాస్థానము లెఱుఁగక
బోనము విడనాడి యిటులు బొరలుట తగునే
పనిలేని శంక లేలను
చనియెద మీనూక దినఁగఁ జయ్యన ననుచున్. ౪౦

ద్వి. తనునీతులను బల్కెఁ దగవు లేకుండ
తగుఁ బల్కఁగా యుక్తిఁ దఱిఁ దప్పకుండ. ౪౧

ఈర్ష్యాళువును గ్రోధి యిలను శంకితుఁడు
పరభాగ్యజీవియుఁ బరఁగ నిందితుఁడు. ౪౨

సంతోషహీనుండు సత్య మీయుర్వి
సంతసింపఁగ లేరు సరవి నాగ్గురును. ౪౩

అని నీతికోవిదు లాడెద రనిన
విని నేలపై వ్రాలె వింతగా నపుడె. ౪౪

మునికపోతముమాట మొదలఁగాఁ దలఁచి
సదమలవిద్యఁ దాఁ జదివినఁ గాని. ౪౫
లోభులై చెడుదు రీ లోకులు గాన
లోభము యిడుములలోఁ గారణంబు. ౪౬
అంత నానులిబ్రాల నక్కపోతములు
చింతశోకయ తినఁ జెంత నే దాఁగి. ౪౭
జాలరి వల సేసె జాలి లేకుండ
కలరవంబులుఁ జిక్కి కనలుచు నపుడు. ౪౮
వృద్ధు నాకలరవు శ్రేష్ఠఁగాఁ గని "య
బద్ధపుపలుకుచే బంధ మొందితిమి.  ౪౯
అనుచు నిందింపఁగా నపుడె దోణంగ
నానిందచందంబు నవధరింపుండు. ౫౦

క. బుద్ధికలవాఁడె పెద్దయు
పెద్దయుఁ గా డెపుడు వయసు పెద్దయగుటచే
సుద్దులఁ జెప్పం దగునే
పెద్దను నేనంచు మదిని బింకము గదురన్. ౫౧

క. నా విని చిత్రగ్రీవుఁడు
కావరమున వానినిందఁ గలి యగు మనకున్
క్రోధం గనరే వీరలు
క్రోధంగా రాదె యపుడె తుచ్ఛం బనుచున్. ౫౨

క. ఆపద రాఁగలతఱిలోఁ
జూపదు శుభవాక్యమైన చోద్యము చెడుగై
తాపం బిఁ కేల యితఁ డా
యాపదలకుఁ గారణంబు హో గనుఁడు మదిన్. ౫౩

క. ఈతఁడు చెప్పినవాక్యము, మేఁతం జవిచేత మీకు మేలై మదిలో
భ్రాంతిపలుకయ్యె వట్టిఁగఁ, గూఁతల కే మిప్పుడు మీఁదు కూర్పంగనుఁడీ.

ద్వి. అనిన కపోతములపు మారకుండఁ,గని చిత్రగ్రీవుండుఘనతఁ దాఁబలికె.

క. నాచెప్పెడి ప్రతిక్రియయిది, మీకేఁ గాకున్న నొకటమింటి కెగురఁగాన్
నాచేఁత గాచు మనలను, నీచులమని యెన్న మీకు నేమమె మదిలోన్. ౫౬

ద్వి. అటులు పల్కుడు వేగ నాపావురంబు
పటుమతి సామ్యంబు పలికెను వినుఁడు. ౫౭

క. ఎత్తిలితృణంబు లెల్లం, గుత్తిఁగఁ గూడంగ నేనుఁగును గట్టఁగ నా
సత్తువతగ్గిన ప్రాణులు, మొత్తములై చేయ నగును మూర్ఖత విడుఁడీ. ౫౮

క. నా విని పారావతములు, నావలఁ గొనినింగి కెగసె నవిచారతతో
నావడి విని యవ్వ్యాధుడు, తావలముం దెలియుకొ ఉకుఁ దర లెన్ జూడన్.

ఆ. ఈపులుగులు నేల నీగుడుఁబట్టెన, నమచుఁ గ్రింద నతఁడు నరుగుచుండె
లఘుపతనక మనెడులావరివాయసం, బేగె వింతఁ జూడ సాగి వెంట. ౬౦

ఆ. చూపు దప్పఁగానె చులుకనై వ్యాధుండు,చులుక నిగతితోడ నిలవుఁ జేసె
గాన నాసకాఁడు ఘనుఁడైనభువిలోన, లాఘవమ్ముఁ జెందులాఁతియగును.

ఆ. పావురములు వృద్ధపారావతంబును, పాటవంబువొగడె పటుతరముగ
దానఁబలుకువినమిఁదామసి విబుధుండు, తాల్మిఁదాల్చియున్నఁదగవు లేదు.

ఆ. హితులు ముగ్వురు భువి సతతము తలిదండ్రు
లట్లు మిత్రుఁడు ప్రియు లవ్వ లెపుడు
గాన నా ప్పుఁ డొకఁడు గలఁడు గండకియొద్ద
నే స్త మందఱందు దుస్తరంబు. ౬౩

గీ. అతఁడు మూషికముల ఱేఁడు నగుచునుండు
పేరుగలదు హిరణ్యుఁ డన బిరుదు గాఁగ

వాఁడి గలిగినపండ్ల నివ్వలనుగొఱికి
వానలఁ దప్పించు నాపద మునుఁగకుండ. ౯౮

సీ. ఆతనికలుఁగున కతివేగమున నేగి
　　　　చొచ్చెప మాతనిఁ జూచి శరణ
మనుడుఁ బావురములు ఘనమార్గమున చేగి
　　　　సరగున లాఁగడగ్గఱఁగ వ్రాలె
వ్రాలుడు నపుడు హిరణ్యకుఁ డాసద్దు
　　　　వినుడు లాఁగకుఁ జొచ్చి విన్నవోయెఁ
జొచ్చుడు బొరియకుం జూచి చిత్రగ్రీవుఁ
　　　　డంతట గొంతెత్తి యలుక డాఁగె

గీ. పలుకకుండుట కత మెద్ది? "పలుకు"మనఁగ
నప్పు డుప్పొంగి యప్పల్కు చొప్పఁ దెలిసి
వైళ మాలాఁగ వెలువడి వచ్చి నుడివె
నార సాకతకాని నే నొరసి కంటి
నేత్రపర్వంబుగా నేఁడు నిండె నెల్ల. ౯౯

సీ. పలికినయప్పు డాపావురంబును నెల్ల
　　　　గని వెఱఁగంది తాఁ గనుల నీరు
గార్చెఁగా ధరణిలోఁ గలిగియుండఁగఁ బ్రేమ
　　　　ముడివడి చిత్తంబు నుడియుఁ దప్ప
గాన నడిగె చిత్రకంఠు ని దేమని
　　　　చెప్పఁ దొణఁగె నతఁడు చిత్రభమను
మిత్రమ! మునుచేత మెలఁగినఫల మిది
　　　　చేసినమునుచేత చెడదు గాదె.

గీ. గాన నిటు వచ్చితే నినుఁ గాంచుకొఱకుఁ
జిక్కి తప్పించుకొనుటకుఁ జక్కఁ గనక

వచ్చినాఁడను నావంత వ్రచ్చి మనఁగఁ
గొఱికి దప్పింప నచ్చటి కుఱికె నెలుక. ౬౬

క. అట్లుఱికి పావురముకడ, కట్లెల్లం దప్పఁ గొఱుకు వెడగుం జూపన్
ఇట్లెల్ల నాదుపెప్పాట యట్లుండఁగ నాదుగుమియు హా ప్రియమిత్రా. ౬౭

క. నెయ్యంబు హేతువగుచోఁ, జయ్యన నుపకృతినిఁ జేయ సరసపుఁబనియే
ఇయ్యకొను టదియు లేకను, నెయ్యంబని యంద్రు పుడమి నీతివిధిజ్ఞుల్

క. కావున నాయాశ్రితులను, గావుము మునుచేఁత దాన ఘనతయు మాకున్
బ్రోవందగు నాశ్రితులం దా, వనటం బొందియున్న ధర్మువు నది యౌ.

క. అని పలుకఁగ నాపలుకులు, వినియెలుకయు బదులుపలికె విసువుచుమదిలోన్
ఘనతయె తా నిబ్బందినిఁ, గనలుచుఁ బెఱవారిఁబ్రోవ ఘన మెయ్యెడనో.

క. నాదంతంబులు లేఁతవి, యీపట్టుపువలను గొఱుక నియ్యకొనుటకున్
నీదాపున వదలించెద, నాదారము నంతఁద్రెంప నఱుగుం గొఱల్. ౭౧

క. అనవుడు చిత్రగ్రీవుఁడు, విని నీచేఁజేయఁదగినవిధి నాపదువున్
జనుఁ దప్పింపఁగ నాపై; యనువుం జూచెదమనంగ ననె నెలుకయుఁదాన్.

ఆ. తన్ను మాని యొరులఁ జప్పింపఁ బాటియే, తనకుమానిధర్మువనఁగ నసలు
చెడినబేర మనఁగఁజెల్లునె పుడమిని, యనెడులోకవార్త వినఁగ లేదె? ౭౩

ఆ. తనువుగలుగఁ గానిధర్మువు గలుగదు, తనువు చెడ్డవెనుక ధర్మ మెట్టులు
ననుచుఁ దాను బలికె నాచిత్రగ్రీవుండు, నసమ! నీదువార్త న్యాయమగును.

గీ. అయిన నావారిదుఃఖంబు నణపఁజాల, కడగినాఁడను నాదె యీయర్థమెల్ల
చేయఁదగునీకుఁజెనఁటుచేఁత కాదు. ప్రాజ్ఞ! ప్రాజ్ఞుఁడు చెనఁటఁడు ప్రాజ్ఞకరణి.

క. విజ్ఞుం డెప్పుడు ధర్మువ, వజ్ఞంబడఁద్రోయ దనెడు వాక్యము గని తా
నజ్ఞత ధనజీవితములు, పజ్ఞంబగునాస విడుచుఁ బరువొందుకై. ౭౬

క. పెఱమానవులకు వచ్చిన, నెఱయాపదఁ జూచి దాని నియమింపంగా
నుఱువగుజతనము సలిపెడు, తెఱవుంజూపును నిజంబు తీవ్రలతోడన్. ౭౭

ద్వి. అరియటులుండంగనరసియుఁ గనుము,మదిని గస్తిని జెంద మానుమీ మిత్ర.

క. నాబలఁగ విడదియుఁ గావున, నీబలఁగము గాఁగఁ జూడు నెనరొంది మదిన్
నాబలిమి కిదియె కార్యం, బెబలవంతుండ నంచు నీగుటకతనన్. ౧౯

క. ఆశ్వాస ముండు దేహము, శాశ్వతయశ మొందుమయ్య సన్మతితోడన్
ఆశ్వాసింపుము వీరల,యాశ్వాసమె నాది యనెడు నాస గదురగాన్. ౨౦

క. హేయంబ తనదు దేహము, దేయంబితరంబు ననెడుదృష్టియుఁ దోఁపన్
సాయంబు సేయు వీరలు,చేయంబడుధర్మ వెల్లఁజెందెడు నీకున్. ౨౧

క. తీఱుఁగఁ జేయుము దీనిని, యాఱవపా లబ్బునాకు నధిపుడ నగుటన్
వే ఱెవెఱ వెద్ది తెలుపుము, తీఱుఁగ నాశ్రితులఁబ్రోవ ధీరుఁడ భువిలో.

ద్వి. అనుడు మంథరమగు నానందమునను, వినుముతుందిలుఁడగుచువిజ్ఞాపిఁసుచును
అది కందళింపఁగా నగునూర్పువలని, మదిచల్లఁదనమున మై నంకురించె. ౨౨
నన గరిసాడించిన యారోమనవల,ఘనసురభిళమగు గాఢవాక్కులను ౨౩
ననె హిరణ్యుఁడు దాను వాకపోతమును, వినుము చిత్రగ్రీవ వీనుల నొగ్గి.

ఆ. మేలుమేలు భళిరె మిత్రవాత్సల్యంబు, పొగడుటకును నాసు ప్రౌఢవశమె
ఏ స్తుతించుటకును నేపాటివాఁడను, నీగొనము త్రిలోకి నీసుతమనె. ౨౪

ఆ. అటులు పలికియెలుకపటుతరమగుపండ్ల,చటులగతిని కొఱికెఁ గుటిలమెడలి
కొఱుకుడుఁ జెలికానిఁ గుటిలతవిడిపల్కె,నోయిమిత్రమ విను మోర్పు దెలియ..

ఆ. ఎంతవానికైన నేపదు కర్మంబు, వంత నొందఁజేయుఁ జింత వలదు
పంతమువిడి నరుఁడు పామరత్వమునన, లంతివంతకు స్థలంబు నీడు. ౨౫

ఆ. వలను దగులుకోలు వంతనికుందకు, సర్వమెఱిఁగినట్టి సాహసివియు
వగవకుండుమయ్య తెగువతో నిపుడు నాబోంట్లు నీకుఁ బలుకు బంట్లె చెపుమ.

ఆ. అనుచు నూఱడించి పనిచె నాబలఁగము, బుజ్జగించి పిదప బువ్వమొసఁగి
పిదపఁబావురముల పెద్ద యొల్కం గని, నెనరుఁజూచి పొగడి చనియెనిరవు..

సీ. ఒకమూషికముమైత్రి యాకపోతంబుల కిక్కట్టు దప్పించె నిక్కతమున
పెక్కండ్రు గలిగిన పెక్కుచిక్కులు దప్పు, పెక్కు ప్రేముడి వేనిసక్కమేల
కావున ప్రేముడి కంటె లాభము లేదు, కామక్రోధంబులు గడకుఁ ద్రోలి
శేముషీమంతులై శ్రీమంతులగువారి, ప్రేముడిఁ గనఁదగు నీమ మమర
గీ. ననుచు రాజసుతులు వినఁ జెప్పె నావిష్ణు, శర్మ యొలుక మఱియుఁ జనియెలాఁగ
ననఁగ వార లపుడె యచ్చెరువొందుచుఁ, జెప్పుఁడు పైకతఁ జెప్పుఁ డనిరి.
క. శేమా! పద్మజముఖగుహా, ధామా! సుమనోహృదబ్జధామా సుగుణ
స్తోమా! జితకుందరదన, భామా! వచనజితమృతసు భామా! భూమా!

గద్య. వేంపటాన్వయపారావారసుధాకరుండగు చినస్వామిశాస్త్రి
తనూభవుండును నాగమాంబికాగర్భశుక్తి ముక్తాఫలుండును
శ్రీశైల మల్లికార్జున భ్రమరాంబికాకటాక్షలబ్ధవరుండు
నగుకుటుంబయ్యశాస్త్రిచే రచియింపం మిత్ర
లాభంబునఁ బడిన హితోపదేశమందు
గపోతమోక్షంబను. ప్రథమ
గుచ్ఛంబు ముగిసెను.

---

# మిత్రలాభము

## ద్వితీయగుచ్ఛము

క. అంబం గొల్చెద సూరిను, తంబగు పాదాబ్జలాలితాళియు నై నే
నంబుజజాంతర్గళకీ, రంపై బింబోష్ఠమందు రాణి న్వాణిన్. ౧

వ. అట్లా రాచకొమరులు విష్ణుశర్మ నడుగ వారి యుత్సాహంబున కలరి
యా నేర్పరి యగునతం డవధరింపుం డని యి ట్లనియె. ౨

సీ. పిమ్మట వీనివృత్తమ్మును నరయగ నా లఘుపతనకమను లావరీఁడు
జరిగినకార్యంబుఁ జక్కఁగఁ బరికించి, మదిని యచ్చెరువొంది మాన్యచరితు
లాఁగదాపునదగి లోఁగఁజొచ్చుటఁజూచి, సక్కమడిగె నిట్లు సాహసమున
ఓమిత్రమా! నీదుసామము గంటిని, సక్క మిపుడె యిమ్ము నిక్కమముగ

గీ. కోరివచ్చినవాఁడను గొనుము నన్ను. ననిన భీతిని డాఁగి యయ్యలుగునంచె
ఏవ్వఁడీవనియెలు గెత్తియెలుక యడిగె, వాయసంబునుబలికెనీవాక్యమపుడె.

సీ. నేను వాయసమును నిను గాన వచ్చితి, నా పేరు లఘుపత నకము వినవె
యనఁగానె యాయెలుక దివిని నగె సరి,గ్సరి నిన్నుఁ గలయుట సరసమాయె
తగువాని నెయ్యముఁ దగవు లే దీభువి, తగనివానిని గూడఁ దగదు గాదె
భోజ్యమేనగుటచే భోక్తవీవగుటచే, భోక్తృభోజ్యములకుఁ బొందుతగునె

గీ. పాముపడగను భేకంబు పడఁగ నగునె
వ్యాఘ్రము మున్నను మృగములు వరల నగునె
శత్రునింటను బువ్వంబు సలుపనగునె,
గాన నీతోడి నేస్తంబుగాదుకాదు. ౪

గీ. దీని కెక్కుడుసామ్యంబు దాని వినుము,
నక్కజిత్తుల జింకయుఁ జిక్కి మున్న
సక్కకాఁ డగుకాకిచేఁ జిక్కు దప్పె.
నక్కథను విను చెవులకు నెక్కునటులు. ౫

గీ. అనిన విని కాక మాకథ వినుట కిపుడు
మనము పుట్టెఁడు విస్తర మొనరఁ దెలుపు
మనుడుఁ బలికెను మూషిక మలరు చపుడు
జింక నక్కచేఁ జెందిన చింత లెల్ల. ౬

వ. వందిమాగధబృంద సుందరంబును విటనటగాయకాది నిఖిలజనసందోహ
మంథరంబు నగు మగధదేశంబున మందారవతి యనంబరఁగు కాననం
బొండు గల దందు మృగకాకంబులు రెండు ప్రాఁగాపులై వమ్ములేని
సఖ్యమ్మున కిమ్ములై యాయిమ్మున నిత్యమ్ముగ నివసింపుచుండెను. ౭

ఉ. అమ్మెక మయ్యరణ్యమున నల్లన మేఁతల మేసి బీండ్లలో
కమ్మని దేహకాంతులును గ్రాలఁగ నిచ్చఁ జరించుచుండఁగా
నమ్మృగికంబుతోడఁ గని యొక్కెడ నక్కయుఁ జొక్కుచు న్మది
న్నిమ్మెక మెందెఁ బోతరము, నెమ్మెయి నంచు నెదం దలంచుచున్. ౮

ఉ. నమ్మెక మెట్లు దీని కగు నాపయి నంచును సంతసంబున
న్నమ్మెక మిమ్ముఁ జేరి కని యాలరితో ననె "రమ్ము నెచ్చెలీ!
రమ్మని నేమమా యనఁగ రంకపు డెవ్వఁడ వీ వనఁగ నా
వమ్మనలంచుజంబుకము వల్కె "సుబుద్ధిని నక్క" నంచుఁదాన్. ౯

సీ. నాచుట్టములు నన్ను నీచుఁగాఁ దలఁచుచు, నిక్కాననంబున నిక్కమునుము
నొంటివిడిచినారు జంటలే కీయెడ, మృతకల్పతను జెంది మిణుకుచుంటి
వినుము దైవముసాక్షి నినుఁజూడఁగాఁ బుట్టె, నందఱఁజూచినచంద మొప్పె
సజ్జనసంగతి సకలదోషఘ్నంబు, శుభములిచ్చుననుచు సుముఖు లనిరి. ౧౦

గీ. దానికీడిది నీదు నేస్తంబు నిపుడు, గోరుచున్నాఁడ నాకోర్కె తీఱునవఁగ
మంచి దట్టులు నేసెద నంచు జింక, వఱడుగొని యేగె సాయ మావాసమునకు.

సీ. అచ్చట మందార మనువృక్షమందున, వాసము చేయు నావాయసంబు
నిక్కుచు నున్న నానక్కను జూచి తా, నుక్కున నెవ్వఁడో వొక్కి పలుకు
మనుడు జింక పలికె వినుము సక్కెముఁ గోరి, డిక్కు లేకుండిన నక్క యనుచు
నావుడు విని కాక మీపఱదు సక్కియ, మెక్కుడుగా దెప్డు దక్క దిలను
చిక్కించి చిక్కిన చక్కిఁగని వెక్కిరించు మీఱినజాతి నిక్కవంబు
క్రొత్తఁగ వచ్చినఁ జిత్తము నొరయక, యుత్తలపాటున హత్తు కెట్లు
కులశీలములు దెల్ప కిల నేరికిని గాని, తావిచ్చుటయు నిట్లు శీవి గాదు.

గీ. గాన మును గ్రద్ధ పిల్లికి స్థానమిచ్చి చావు నొందినకత చెవిఁ జవులు వుట్ట
విస్తరించెద వినుము సవిస్తరముగ, ననుచుఁ జెప్పుట కాకాక మపుడు పూనె.

చ. సురనదియొడ్డునం గలదు జువ్వి యనంగ నొకండు మానుగా
పురముగ నుండు దొఱ్ఱలను బుల్గులఁ గాచెడువృద్ధుఁ గ్రద్ధ వాఁ
డరయఁగ లాఁతిపుల్గు లెర నప్పన మప్పస మొప్ప నివ్వనా
యెర నెరఁగొంచుఁ గామకొని యొగ్గుఁ దలంపక యుండె నొద్దికన్. ౧౨

చ. అపుడ బిడాల మొక్కఁ డట నగ్గల మొప్పఁగ నున్నపక్షుల
న్నెపమున జూడఁ బుల్గుగమి నెట్టనఁ గూయని కూఁతఁ గూయఁగా
నపకృతి గల్గె పుల్గుగమి కంచును బర్వున నిమ్ము వెల్వడె
న్నపకృతిఁ జేతు వీనికని యున్నతిఁ దోపగ నప్డు గ్రద్ధ తాఁ. ౧౩

ఉ. వెల్వడి యెవ్వరచ్చటని వేగమె పల్కఁగ నాబిడాలమున్
చల్వలు గ్రమ్మి నే నిచటఁ జావఁగఁ జొచ్చితిఁ దొల్గనైతిఁగా
యల్వడి జిక్కినాఁడ నిఁక నబ్బకతప్పునె కిన్క వీనికిన్
చెల్వపు నెయ్య మిత్తుఁ దల చిక్కఁగ తోటను బోటు దప్పునే. ౧౪

చ. అనుచు బిడాల మెట్టయెదు టబ్బుర మొప్పఁగ గ్రద్దఁ దాఁ గనెన్
గనుఁడు జరద్గవంబ విను గన్గొని పల్కెద నీదుశాంతతన్

గనుము నమస్కరించెదను గాదిలి సల్ప మనంగ డేగ తాఁ
గనుఁగొని యెవ్వఁ డీ విచట కారణ మేమి వసింపఁగా ననెన్. ౧౫

వ. నేను దీర్ఘకర్ణ మను పేరం బరంగెడు బిడాలంబనని పల్క నాజరద్గవంబను ముదిడేగ "నీమనుగడఁ గోరెదవేని యెచ్చటికేని విచ్చేయుము. అటు గానిచో నిచట చచ్చుట కచ్చుకొనుము నాబీర మరయు" మనుచు నుడివె నది విని పిల్లి. ౧౬

ఆ. పలికెద నొకమాటఁ బథ్యంబుగా విను, బథ్యమునకు నెదురు బల్కరాదు
చంపఁదగినవానిఁ జంపఁగఁ దగుఁ గాని, చంపరాని వానిఁ జంపఁ డగునె.

క. మడియింపఁ దగుదునో నే, నొడబడికకుఁ దగినవాఁడ నో గను మదిలో
బెడమాట లేల నాతో, నొడఁబడుమీ? గృధ్రరాజ! యొదగుమి లేమిన్.

క. గుణహీనుఁడొ గుణవంతుఁడొ, గణనం బొనరించి వెనుకఁ గడఁ ద్రోయఁదగున్
గణనం బొనరించకమును గుణహీనుఁడ వనుట తగునె గుణవంతులకున్. ౧౮

సీ. జాతిమాత్రముచేత నీతిలేదని త్రోయఁ, దగునె నీ కని పిల్లి ధాటి నడుగ
నప్పుడె శాంతించియనియెరాఁబనిఁదెల్పు, మనుఁడు పిల్లి వల్కె మనసుపొంగ
మాన్యచరిత నీవు మన్నింపుమీ నాదు, మాన్యచరితము నీదుమదిని నిల్పి
గంగను నిత్యము సంగంబు గ్రుంగించి మాంసంబు దినుట నామదిని రోసి
బ్రహ్మచారినగుచుఁబరఁగఁజాంద్రాయణ, వ్రతముసల్పుచునుంటినమ్ము నెట్లు.

గీ. నీదుధర్మంబుఁ బక్షులు నిజము దెల్ప
వినుము నీసుదర్శనమును నెనయఁ గోరి
చాలకాలమునుండి నే వేళఁ గాచి
యుంటి నిప్పుడు లభియించె యునికిమనకు. ౨౦

క. ధర్మవు దెలిసినమీరలు, ధర్మవు గా దిట్లు చంపఁ దలకొనుట మదిన్
ధర్మము గృహవాసుల కిది, నిర్మలమతి రిపునికైన నిల వొందినచోన్. ౨౧

క. ఆతిథ్యం బిడఁ దగు నని, యైతిహ్యము గలదు లేమి నన్నం బిడఁగా
మతిమంతుఁడు నెఱపలుకుల నతిథిం బూజింపవలయు ననువగు మదిలోన్.

వ. అనఁగ నాగ్రద్ద మనంబు పొంగి యి ట్లనియె. ౨౩

ఆ. పిశితమందు నీకుఁ బ్రీతియగుటఁ బక్షి, పిల్లల కెరవగుటఁ బిరికి నైతి
నవఁగ పిల్లి చెవుల నప్డె మూసికొనుచు, కృష్ణకృష్ణయనియెఁ గష్ట మహర.

వ. అటులు ననుఁడు మఱియు పిల్లి. ౨౫

ఆ. తొంటిచెడుగుచేతఁ దుంటరినై యిప్డు పిల్లిపుట్టు వొంది సొలయుచుంటి
నదియుఁ గాక బాలహత్య యొండీపుట్టు వందు సల్ప నగునె యల్పమతిని.

సీ. ఎంతవాఁడవు నీవు నెంతటిమాట యహా, నిట్టిచాంద్రాయణ మిటులు సేయ
ఈలాటిపాపము కేల గట్టెద నోడి, నొకటికొకటి యెదురు నకట వేద
మదిగూడమక్కుటయవనిఁగాదనిపల్కు, పల్కుకుఁజెనఁకకపడియెయుండు
నట్టియాగమోక్తి కలరుచుండెడివారి, కబ్బును స్వర్గంబు నిబ్బరముగ

గీ. చేతనుండెడినిమ్మపం మాఁత గాఁగ
భూతములయందున నెనరుచేఁతకాఁడు
నరయువారలయందునసాధ్యుఁడవును
నెనరులేకున్న భువినుండిచనినవాఁడె. ౨౭

గీ. తాను జేసినధర్మవె తోన నేగు, భువిని తక్కటి దేదియుఁ బొరయ దటులు
నవని నాటిననెఱవిత్తు కందు పండు, తక్కువానికి నెట్టులు దక్కు ఫలము.

క. తెలియక చెడితిని మును నేఁ, దెలివొందిపు డెటులు నెడుదుఁ దెల్లముగా
నాఁకలి గాఁగఁ గాయగపురులు వలసినయెడఁ గూరనైన వైశమతినెదఁ.

క. పొట్టకునై నీతొవున, పిట్టల మడియింప నధిప పెద్దవు నీకుం
జుట్టల నిట్టులు నలుకను, జెట్టిదమగుపలుకుఁ బలుక బిడియము లేదే. ౩౦

వ. నా నాగ్రద్ద విని క్రొత్తఁగా హత్తువారిచిత్తంబు లొత్తక హత్తుట
యుత్తలపాటు నుత్తంభించుట గాన నిప్పలుకు నిప్పుడు దప్పఁగ నొప్పుకో
లొప్పిదం బగునె యని యి ట్లనియె. ౩౧

క. మర్వ్యాగుచేఁత న్మఅవుము, మర్వ్యాకు రాఁగలుగుచేఁత మాన్యుల కిది బ
ల్పర్వ్యాగు గావున రాకయు, నిర్వంచన మిటకు నీకు నిర్మలచరితా. ౩౨

క. అని గ్రద్ధ వలుకఁగా విని,
యొనయుచు నెయ్యంపుతోఁట నిమ్మొనరించెన్
దినములు గొన్నియుఁ గడచుడు,
చనవున నడిరేయి రేఁగి చని తోఁటలకున్. ౩౩

క. పక్షులపిల్లలగొంతులు, భక్షించెను నులిమి గూండ్లు బక్షులు గని యా
వృక్షంబున డింభకులన్, దక్షణమే వెదుకుచుండఁ దాఁ గని వానిన్. ౩౪

క. ఇపలని కప్ర చేరక, యావమ్ము వలంచుపల్లి యావలి కేగెన్
ఈవంచన నెఱుఁగఁగఁ జనెఁ, గావలిగా నుండుగ్రద్ద కడకుం బక్షుల్. ౩౫

క. పక్షులఁ గాచుచునుండు వి, చక్షణుఁడగుగ్రద్ద తోఁటసామీప్యమునన్
సాక్షిఁగఁ బిల్లల యెముకల, వీక్షించి యి దేమి చేటు వీనికి ననుచున్. ౩౬

క. పక్షులఁ గాచెద ననుచును, భక్షించె నిదేమి యనుచు భావమునందున్
గుక్షింభరుఁ డీతండని, వీక్షింపమి నెపుడునిటులు వీడెను నిసువుల్. ౩౭

క. అని వగచుచు డాయంజని, కనితోఁటు న్నిద్దయునికిఁ గావర మేదన్
గొనగోళ్లను ముక్కులచే, దొనలుగి నెత్తురులు గాఱఁ దోరపుటలుకన్. ౩౮

క. రక్కయుఁజిక్కక దానికి, నుక్కున నాకసము కెగసి యుర్వికి దిగుచున్
టక్కునఁదలపైఁబొడుచుచు, గ్రుక్కఁగఁ జేసియును జంపె శూరతతోడన్.

క. కావునఁ కుక్షింభరులను రావించుట, కూడవంద్రు రంజిల్లుమతుల్
చావు ఘటిల్లుం, దానన్ బ్రోవందగ దెపుడు నంటురోగులపగిదిన్. ౪౦

వ. కావున నూత్నరత్నంబుల యత్నంబున నొరసినపగిదిని బ్రొమ్మానసిని
నెమ్మనంబని యొరయక నమ్మరాదని యకార్యకంబు నొక్కి యుగ్గడిం
చిన విని నక్క నిక్కి చూచుచు మనంబున కినుక గదురఁ గన్ను లెఱ్ఱఁజేసి
ముక్కు మూరెఁడు గాఁగఁ గోపగించి. ౪౧

వ. ఓయి కాకమా! తొలుత మెకంబున కీవును గ్రొత్తయై యుందువుగదా ? ఇప్పు డెటులు స్నేహం బతిశయిల్లె. మాఱు బలుకువారు లేనందున నిటు లాడుమన్నా వని నుడివెయును. ౭౨

గీ. మాఱుమ్రానులు వెదకిన మసలకున్న
నాముదపుమ్రానె యప్డు పూజ్యంబు వినుము
చుఱుకు బుద్ధులు నెచ్చట శూన్యులగుదు
రచట మాన్యులు భువిలోన నల్పమతులు. ౭౩

గీ. తాను బరు లను భేదంబులెక్కి భువిని
మెలఁగుచుండెడివారలె యలఘుమతులు
వారి నెప్పుడు లోకంబు వదలకుండు
మెకముపగిదిని నీవును మెలఁగు మిపుడు. ౭౪

గీ. లోక మున్నంతకాలము నాఁకయెట్లు
మృత్యు వెప్పుడు గాచెడు మ్రింగ మేను
నున్నదనుకను మంచివాఁ డన్నఁజాలు
విమమబుద్ధుఃఫలము విశేషమగునె. ౭౫

క. వ్యవహారికతమున జీవులు, నవమతిబహుమతుల నొంది యలరెద రిల శ
త్రువు చెలికాఁడను పేరున, భువి నన వాయసము పలికె భూరిముదముతోన్. ౭౬

ఉ. కాకము జింక నక్కయును గానల నేకత నొంది నెమ్మదిన్
రాఁకయుఁ బోకయుం గలిగి రాజిలుచుండఁగ నొక్కనాఁడు జం
బూకము జింకఁ జూచి మదిఁ బుద్ధి దలిర్పఁగ వాక్యమొక్కఁడున్
వేకువ లేచి పల్కె మదిఁ వీగుచు సాకతకాఁడ యేగుమా
నీ కికఁ మేఁతమేయుటకు నిండగుచేనును జూచి తిప్పడే. ౭౭

వ. అని యిట్లు మృదుమధురవాక్యంబు నుడివి. ౭౮

చ. మెకమును వెంటఁ బెట్టుకొని మేఁతకు జేనును జూపెఁ భిమ్మటన్
మెకమును నిత్య మాపొలము మేయుట కేఁగఁగఁ జేనికాపరిఁ

డొకదిన మద్ది తాను గనుఁ దుమ్మలికమ్మనఁ బన్నె జాలమున్
పకుటున పైరు దక్కు డీకఁ జయ్యన జీల్చక నంచు దాపుగాన్. ౪౯

ఉ. గూఢముగాఁగఁ బన్ని వల నొబ్బన నింటికి నేగెఁ గాపు తా
న్గాఢపు మేఁత మేయుటకుఁ గైకొని వేడుక నాఁడు వాడుకన్
రూఢిఁగ నారబంబు భువి రోలుచుఁ జొచ్చినఁ బత్తణంబునన్
గాఢము కాఁగ నవ్వలను గ్రుక్కునఁ జిక్కియు గ్రుక్కి యిట్లనెన్. ౫౦

తే. అయ్యొ చిక్కితి వలలోన నాథు లెవరు, దీనివిడిపించు నమ్మేటిదిట్టవఱుదు
నతఁడు గలిగిన నాపద నాపఁగలఁడు, నెచ్చెనుండెనొకా నతఁ డిప్పుడనుచు.

క. అంతట నక్కయడప్పుడ, వింతగ నేతెంచి మెకము వెంబడి నిలువన్
జెంతకె వచ్చితి విప్పుడు, చింతంతయు నంత మొందె చెలికాఁడయనన్.

వ. అప్పుడు. ౫౩

సీ. మనమున సంతోష మొనరించు నానక్క, పైకిఁ జూపును మిత్రభావ మెల్ల
ఇన్ని నాళ్లకు యత్న మొనగూడె నాకనున్, స్నేహభావముఁ జూపఁ
జెంత కేగు,
జింకకండల చవి జీర్ణించుననుకొనున్, తప్పించు చొప్పు తానొప్పఁజూపు,
భూస్వామి యేతెంచి పాలయించు నెపుడను నెంతపని నీకనుచుఁ జెంతఁజేరు

గీ. చొప్పు దెలియని చందముఁ జూపనిటులు, కాలమే గను భూస్వామి కాలగతిని
నాలసింపఁగ నింతలో నిలయమునను, మెకపు రాకను గానక మేఁత కేగె.

వ. కాకము తాను నా పొలము డగ్గఱె. ౫౫

గీ. డాఁగియుండఁగ నానక్క డాయ నేగి
నమ్మె నామాట యివి యెమ్మలిమ్మ గాను
పన్ని యల్లిన వల దీనిఁ బంటఁ గొఱుక
భానువారపు నోము ననాను కెటులు. ౫౬

గీ. వేఱు తలఁచుట నీ కిది తీఱుగాదు
పారమొందనుపాయము బల్కు పట్టి
దలను జేసెద ముసలఁగ దలను దాల్చి,
సఖుఁడ హా హంత యనుచును సఖ్య మెదుర. ౫౭

గీ. చూపుమండెడియాచోప్పుచూచివాయ
సంబుమోసమవాటిల్లెజంబుకమున
సంజకాలము చీఁకటి సాగ నిపుడు
సక్కెకాఁడని నమ్మిన నక్క చెనఁకె. ౫౮

గీ. నిక్కఁ జేగడు నిక్కకుఁ బక్కిచయము
మక్కలెల్లను నింగిని నిక్కసాగె
మనుజు లిక్కలఁ బక్కల మసలుచుండ్రి
రాజు రాఁ డాయె నాయమురట్టుసేయ. ౫౯

గీ. పొలము కాపుకుఁగాపులువోవుచుండ్రి
మోసకాండ్రకుఁగాలము మోపుచుండె
చరువుచుండిరిగదయిండ్లఁజదువువారు
ఖగులఁగాచెడిఖగరాజుగానఁడాయె. ౬౦

గీ. చేటుకాలము చెప్పినమాట వినక, చిక్కి యావల జింకయు స్రుక్కుచుండె
నిక్కవెడలియుఁగాపునుజిక్కఁబట్టె, బక్క కేగునోయిక్కడ కుక్కమీఱి.

గీ. సంజకాల్చెడిసమయము సదువరులకు, రాక దప్పెను సంజల రాజు దీర్ఘ
శోక మానదు మిత్రునిఁ బ్రోవ నిపుడు, శోక మేటికి గతముకు నీకతమున.

గీ. అనుచు జింకకుఁ బ్రక్కఁగ నణఁగియుండి,
"ఏమి? యిది" యన జింకయునోముఫలము,
చేటుకాలముదాపుఁగ మాటవినక,
యోటుపడితిని నేనిటుఁ జేటుమూఁడె. ౬౩

గీ. కావు కావుమ గావుము గాచుకాల,మీవుపక్కఁగాఁ గాచుట కెవఁడిక్క
దిక్కనీవని గ్రక్కునఁ దెలుప జింక,సెనరు మదిఁగర్గి కాకము నేర్పగదుర.

గీ. నేనె మునుచెప్ప నామాట నేరమాయె,పరుల కేఁ గీడుఁజేసెడిపాటిఁ గాను
గాన పరులును గీడును గాన రనుచు,మోస మొందుట లగ్గ యీదోసులందు.

గీ. దోసకారుఁడు రోహిణిదాసుఁ డగుచు,
దోసకారులఁ గాచుట కీసుఁ జెంది
డాఁగి యున్నాఁడొ చాటునభోగమొంది,
దోసకాంద్రను జేరిన దోసఁగు పోసఁగు. ౬౬

గీ. హితవు చెప్పిన మును నీవు హితమె యనక,
ఘాత యని మదిఁ దలఁచితి వ్రాఁత గాదె
దీపె నార్పినగంధంబు దివి వసిష్ఠు,
దాపుఁ జేరిన యరుంధతినిహితవు. ౬౭

గీ. వినరు కానరు వెనుక మూర్కొనరు పోవు,
తలఁచియుఁ దరిఁ జేర ననిరిగాఁ జాలుమమతులు
దోసు లెపుడును బాలను దుచనుబోసి
వెనుక విసమును బోసిన పనటులె గద. ౬౮

గీ. అట్టివారల నేస్తంబు గట్టికాదె, యనినహరిణము సిట్లాప్ప లెనయ నుడివె
సజ్జనులతోడిసఖ్యంబు సర్వశ్రేయ, మెటులున ట్లిల్లఁజేటులువిటులహార్తి.

సీ. మాటలందున తీపు మనసున విసమని, పసిపట్ట నైతి నేఁ బసితనమున
జిత్తులు గలదిగాఁ జిత్తము హత్తక, పొత్తు చేసితి నయ్య సత్తుగాను
తేనెమాటలచేతఁ దీపినిఁ దూలితి, ఘాతమాటలచేత దూత నైతి
మోసవోతిని దాన నీసు మనసునఁబాసి,దోసకాఁ డనుకొనక దాసుఁబ్రోవు

గీ. మనఁగ నవ్వుచునుడివిన నెనరునుడిని,
వినుచుఁజెంతను జెనఁకెడిచెనటివఱదు

గనుమఁ గాపరిరాకకుఁ గనలు చనియె,
నోయిచెలికాఁడ! యల్లదె బోయఁడనుచు.

గీ. ఇన్నిపనులకు నిక్కట్టు పన్నిదమున
పడుచుపన్నె నుపాయంబు పడికి నోడి
మృగమ! యుసురును గడుపున బిగియఁబట్టి
బూరటించియుఁ బాదముల్వాఱఁజాచి

గీ. వాలు కెడలంగఁ బెట్టియు నేలమీఁద,
పఱపుగాఁ గనుబడియున్నఁ బైకినెక్కి
నొక్కుచుండియుఁ గన్నుల నుక్కుతోడి,
రాక వే కని కాపరిపోక తెలియు.

గీ. తఱిని తటుకున కూఁతనుతప్పకిడుదు,
తక్కుపొఱుము ప్రాణంబునిక్కు దెసకు
చూవె చూపెద చూపఱు చోద్యమొంద,
కాపుకాపఱు నీనక్కకాపుతోడ. 23

గీ. అనుచుఁ బలికిన కాకంబు కనలి జింక
నక్కఁదిట్టుచుఁబడియుండెఁ బక్కలుబ్బ
దిట్టపఱచిన తీఱుగ దిగులు నొంది,
కాపు వాచొప్పు గని ముప్పు గప్పెననుచు. 24

గీ. చప్పుచప్పున వలచొప్పుఁ గుప్పఁ జేసె,
చప్పునను జింక తాఁ దప్పెఁ "దప్పి చావు
కన్నులొట్టాయె" నని మది తిన్నపడఁగ,
వలనురాజానుచీఁకటివగపుఖగము. 25

గీ. తప్పి చుక్కలఖగులమనొప్పనిక్క,
చేర సాగెను నక్కను జీరికొనక

చ్చాచెనక్కయు నాదిక్కు నాడ్కెంచొనిపి,
యంతటఁ దప్పెరయనికాపు నపుడె బడియ. ౭౬

గీ. వైవ వదితప్పినిశశిచే వఱడుదాఁకె,
రాజు కరములు తమమును రాచినటులు
తాఁకు కానక్క జమునియు ల్డూకెనపుడె,
గుహలఁ దమమును దూఱిన కూర్మిదనర. ౭౭

గీ. ఇమ్ము జింకయు చుక్కల కిమ్ము రాజు,
కాకమును దాఁకెనిక్కఁబావీఁక దనర
కాపుపాలమునఁబైరులఁగాచుచుండె,
శశియు వెన్నెలఁ జక్కఁగఁ జదలఁజూపె. ౭౮

గీ. తప్పి వారుణిరాగము గప్పి తూర్పు,
వార్చి సంధ్య గిరిశుతల వాగు గ్రుంగి
సాగి సత్సభ కిందుఁడు సాచెఁగరము,
సాచ నప్పర ముప్పొంగె సంద్రుఁడపుడె,
సుతునిసన్మార్గ ముద్దిడఁ జొచ్చె ననఁగ. ౭౯

గీ. కుంగె చక్రము నొండు నుప్పొంగె నొండు,
మూగె కాంతియుఁ దమమునుబోగజగతి,
గానసన్మార్గగాముల గనిన దుష్టు,
కుంగుశిష్టుఁడుగాంచినఁబొంగు నెపుడు. ౮౦

గీ. విదుషు సన్మార్గ మృదు జడుఁడందురిలను
కలుకమిత్రుఁడు వీడని కందు రిలను
కాన చందురుఁ బట్టుట మాను నెపుడు,
తముఁడుఁ బూనెడు నపుడప్డుతరణి భీతి,
వసువు లున్నను మార్దవ మెపక మెట్లు. ౮౧

గీ. రాజు కరముల రిక్కల రాజి సణఁచె,
సంజరాగము జనములు సలుపుచుండ్రె

జింక శోకము తమమును దాఁకె నక్క,
నక్క యొకదారిఁ దల్పఁగఁజిక్కె నొకటి. ౭౨

గీ. పరులహానుల గోరెడు పామరులను,
తాము మదినొండు పైవము పలఁకునొండు
దాన యగు మున్నె వానికి హాని గనరె,
గాననరులెప్డు పెజ్ఞులగ్గాననగును. ౭౩

వ. అనిన నాహిరణ్యకుతోఁ గాకం బి ట్లనియె. ౭౪

క. దివిగతి దొలఁగనిజాతికి,నవమతి దలపకను మైత్రి నందినవారిన్,భువి గావ
మతియుఁ గలుగును, దవిలియు బంధమున నెకము తప్పినభంగిన్. ౭౫

క. రక్షించువారి భువిలో, భక్షించుట భావ్య మగునె పామరమతితో
కుక్షింభరులకు నద్ది వి,చక్షణులకు నగునె తిండి చచ్చునె దానన్. ౭౬

క. సజ్జనసాంగత్యము గన, ముజ్జగముల సౌఖ్యపదవిఁ బూర్తిఁగ నిచ్చున్
ఒజ్జ యగు ముత్తిఁ గనుటకు, సజ్జనసాంగత్యమంత సాహసిఁ గంటే. ౭౭

వ. కాన నాయొప్పుఁ గని యుపాంగుచొప్పు నీ కెప్పు డబ్బు నప్పుడ తప్పక
నానేస్త మొప్పుకోలు ని న్గప్పుకొను గాత మందాఁక నిందు పొందుగ
విడుపుకోలందక [illegible] నావాస మొంది యుందు. నీయొప్పుకోలు దప్ప
దని యాచిరజీవి చింతిలుచుం జెంతఁ జేరి నొక్కి యుగ్గడించిన నాహిర
ణ్యకుండు నానుడి యెద ముడివడ గడగడ వడంకి డగ్గుత్తివడి నుడి నుడివ
డ నరి నొరయక మురియుచుఁ జేరం గొరఁగాదని మది జదియ ముద
మేది యదలించుచు ని ట్లనియె. ౭౮

గీ. ఓయిచిరజీవి చపలుఁడ పోయి రమ్ము,చెనటికైనను శత్రునిఁ జేర నగునె
కానిపనిచేత యగునట్టిపనికి రోఁత, చేయ నేరికి శక్యంబు చెనటిచెపుమా

చ. జలముల నౌను నౌకనడ సల్పుట భూమినిఁ గాదు నడ్పఁగాన్
సలిలముపైని బండ్ల నడ సల్పుట కా దిల నౌను నడ్పఁగాన్

ఫలముల కందకుండఁగను బారలు సాచుట యేల నీ విటన్
చలమున నుండనేల నెర సల్పెడుగాలము దప్పు గద్పప
న్కలకను శుష్కపుంబ్రియము లాడుచు హస్తము శూన్యమైనచోన్. ౧౦

చ. నిలుచుట నీకు మంచిదియె నీచునిభంగిని నోయికాకమా
కలఁచెదవేమి నామనసు కాలము గాదిది పొమ్ము పొమ్మనన్
కలకల నవ్వి కాకమును కాదెటు పల్కుట కానకుండె నా
యలఘుమతిం గపోతమును నాపక గాచిన వేల నైతి నేన్. ౧౧

చ. వెగటుల నాడ నేమిపని వేగమె నేస్తము గోరి వచ్చితిన్
పగ విడనాడి మైత్రి నను బొందమిఁ బ్రాణము విడ్చెద న్వడిన్
సుగమము గాదు భాగ్య మిదె సూచన యంచును బ్రుక్కుచు న్మదిన్
తగ వికఁ నీకు నాకు మఱి తప్పదు పొందును పొందకుండినన్
తగ వినవే సుకీర్తి నిల దాయను గోకిలపిల్లఁ గాచుటల్. ౧౨

చ. సులభముగాను భేద్యమగుఁ జూవె ఘటంబును మట్టి దైనచో
కలయుట కష్ట మానటులు కష్టము దుష్టులకూర్మి గల్గుటల్
సులభము గాదు బ్రద్దలుగఁ జూపుట కాంచనపాత్ర మైన బ్ర
ద్దలయినచో సుఖంబుగనె దాచుట కా సుజనాళిపోలికన్. ౧౩

చ. కరఁగుట లోహముల్ భయము గల్గుట లోభము మూర్ఖజాతులున్
బరఁగఁగఁ గారణంబు మృగపక్షులు దర్శనమొప్ప సజ్జనుల్
సరగున నేస్త మొందెదరు సాకత మొందుము సౌమ్యతన్ మదిన్
సరిగ శుచిత్వదానములు శౌర్యము శుక్సుఖసామ్యము న్మదిన్. ౧౪

చ. మురిపెము సర్వజంతువుల మూగిన మైత్రియు సత్యవర్తనం
బగయ సుహృద్గుణంబు లివి యాగుణజాలము నిండె నీయెడన్
ఎఱుఁగము పక్షియంబు మును పెన్నడు నిట్టిసుహృద్గుణంబుతోన్
మరగితి నిట్టినేస్తమును మానదు నా కిది కష్టమే యనెన్. ౧౫

ఉ. కావుము కావకున్న నిది కష్ట మదృష్టమ యంచు నుండెదన్
నా విని యాహిరణ్యకుఁడు నా నని లా గను తాను వెల్వడెన్
వే వడిఁ గాకముం గనియు వేగమె పల్కెను నోయి వాయసా
చేవఁగ నీదునామ మిలఁ జెప్పఁగ వింటిఁగ నాదువీనులన్. ౯౬

ఉ. కంటిని కంటికింపుగను గన్నుల నీవచనామృతం బిటన్
వింటిని వీనులుం దనియ వీడెను సందియ మీక్షణంబునన్
జంటఁగ నుండఁగా నగును జాడ్య మి కేలను జేరు చెంతకున్
కంటి సుభావమే మదిని గానము దోసము కాకడన్ మదిన్. ౯౭

ఉ. గంధహిమాంబుపూరములు గావుగదా యిలఁ బారిజాతముల్
బంధుసమాగమంబు శ్రమఁ బాపఁగ సజ్జనవాక్యముంబలెన్
బంధము గాఁగ దుర్జనుఁడు వాతను నెమ్మదిఁ బల్కు నొక్కటిన్
గంధము నొంది చేతులను గాఁగను జేయును నొక్కదాని వాఁ
డంధునిఁబోలెఁ దట్టుచును నాగడ మాతనిచర్యఁ జూచినన్. ౯౮

గీ. అనఁగ నుప్పొంగి మిన్నంటె నపుడె కాకి
వసుధిఁ గనుటకు నెలుకయు వసుధఁ జొచ్చె
పొంగు వసుధను ధనికుల కంగములను
జ్ఞాని కగు నింగి వసుధియుం గానఁబడును. ౯౯

ఆ. నాటగోలె నచట నీటులుజూపుచు, చోటు చేసికొనియె నీటుగాను
ఎలుక నేమమరయు చెరఁదెచ్చియిచ్చుచు, తక్కువేమివసువు కిక్కయనుచు.

వ. అపుడె కాలమనుకాపరిఁడు జగతి మైత్రి మిన్న యని తెలుపమింట
నెత్తిన నెత్తుటిపడగయో యన రక్కసుల నుక్కడంప నెత్తుటందడిసిన
రణరంగమో యన నొప్పునంబరంబున శత్రుపైఁ గోపంబు చుంబింప నో
యన నెఱ్ఱనగు బింబంబుచే వసుధాచక్రంబుల ననురాగంబు నూపెనో
యననామిత్రుండు శత్రుజయంబున నుప్పొంగి మిన్నంటె నామిత్రుండును.

వసుధి నేస్తమందె నని యనురాగంబు సూపుచు మిన్నంటె. వ్యవహారంబె కాదె మైత్రిశాత్రవంబుల కాదరు వని యోజనేరుటకు నిరవగు నెరవుఁగని యెరఁదెచ్చి యిచ్చు కాకంబు రాక వీక్షించుచు సన్మార్గసాంగత్యభాషణంబుల నుప్పొంగుచు నాయిక్కనె క్రుక్కక నిక్కుచుండె. ౧౦౧

క. అంబా సుగుణకదంబా, బింబాధర మానసలువ పృథ్వనుముఖబింబా
లంబోదరముఖదైవక, దంబంబులు సాగిపడుపదాంబుజబింబా. ౧౦౨

గద్యము. ఇట్లు శ్రీశైల మల్లికార్జున భ్రమరాంబ కరుణాకటాక్ష
లబ్ధకవితాధుర్యుండును వేంపటాన్వయరాకాసుధాకర
స్వామిశాస్త్రికి నాగమాంబా గర్భశుక్తిముక్తా
ఫలుండు నగు కుటుంబయ్యశాస్త్రిచే
రచియింపంబడినమిత్రలాభం బను
పద్యకావ్యంబున కాకమూషిక
స్నేహం బను ద్వితీయ
గుచ్ఛము ముగిసెను.

---

# మిత్రలాభము

## తృతీయగుచ్ఛము

క. వాణి న్మంజులవాణిన్, వీణం ధరియించి సభల వీగెడు రాణిన్
ఝాణంఝణవాగంత, ర్వాణులవాక్కులను సభల ప్రాలెడుబోటిన్. ౧

వ. ఓరాజరత్నంబులారా! అరయుమి యొకండె బహ్వాపదలకు నాదరువని విష్ణుశర్మ పలుక నింకను విన నాస జనించుచున్నదని యవ్వారలు ప్రత్యుత్తరం బీయ నవధరింపు డనుచు విష్ణుశర్మ చెప్పం దొడంగెను. ౨

ఉ. అంతట నొక్కనాఁ డాచిరజీవియు దూగ మేగి యా
వంతయు మేఁతఁ దాఁ గనక వైళమె లాఁగకు డాయ నేగి నే
డంతయుఁ గాననంబులను నాసఁ జరించియు మేఁతఁ గాన నై
తింతియె నేఁటికర్మమని యీవల కేగితి నిన్నుఁ గానఁగాన్. ౩

వ. అని మఱియు. ౪

శా. ఎచ్చో నైనను వేఱుగాఁ గనెద నీ వేతే న్సుఖం బౌ నసం
దుచ్చంబే నఖదంతరోమనరసందోహంబు లుప్పొంగుచుం
బొచ్చెం బొందెద రిమ్మహిఁ దప్పి యనుచుం బుట్టిల్లె పుణ్యంబుగాఁ
దుచ్ఛం బైనను జొచ్చియుండెదరు నిర్దోషంబు గాదే యిలన్. ౫

గీ. అనిన నక్కాకమామాట నపుడె చెవిని,
బడఁగ నెచ్చెలి దీనివిపాక మరయ
నఖలులందున నగుగాని యన్యులందె,
గజము సింగము విదుషులు గాఢబుద్ధి
విడిచి యిక్కను నిక్కనౌ విచ్చలవిడి. ౬

గీ. చనను కాకము మెకము తుచ్ఛపునరుండు
నిలను విడువక స్థానంబు నీల్గుచుండు
ననిన విని యెల్క దా ననె నపుడె మాఱు
నెచటి కేగెద విచ్చోటు నీవు విడిచి. ౭

గీ. అనిన కాకంబు వెన్వెంట ననియె మరల
గడ్డిపురువులు పెఱపోఁచఁ గఱచి పట్టి
వెనుక నిరవసుపోఁచను విడిచి చనును
నల్లై పెఱయడు గొత్తక యగునె యెత్త
నిచట నంచును బల్కె నాయెల్క నచ్చ. ౮

క. దండకయనునాయటవిని, నుండెం గర్పూరగౌర మొండు సరం బా
మెండగుసరసున ప్రియమి, త్రుండగుదాబేటిమేటి దూగుచునుండెన్. ౯

క. మంధరుఁడని పేరొంది వ, సుంధర సన్మార్గుఁ డనఁగ సుందరుఁ డగుచున్
మంధరగతియును గలుగుసు, గంధమున స్వహాజధర్మగంధం బబ్బెన్. ౧౦

క. అందంబని బుధు లిలలో నందం, ధర్మవుల ననుచు నందము దెలియన్
సుందరముగఁ బలికెద రా, చందంబుగ నడుచుకోలు సాగదు సరిగాన్.

క. ఈతఁడు మీనుల నిచ్చెడు, దాత యుదారుండు గాన దాగెద మచటన్
మేఁతకు ని మ్మాత్కోల నా, నీతగువుకు నిమ్మ్త నగునె యెన్నఁటి కైనన్.

క. నా విని హిరణ్యకుండుం, బోవంగా నీకు నాకుఁ బుణ్యం బే యీ
తావునఁ బని యే మున్నది నే వచ్చెదఁ గూడ ననియె నేమము గదురన్.

క. సమ్మానము జీవనమును, నిమ్మగువిద్యయును బంధుహితులును లేరే
నమ్మహి నుండం దగునా, యెమ్మెయినైనం బుధుండు నేగఁగవలయున్.

మ. అనఁగాఁ గాకము వల్లె లెమ్మ పయనం బైరమ్మ నాతోడ నా
ననయంబున్ సరసంపుమాటలను నాహారంబు నన్యోన్యముం

గొనుచున్ మంథరుఁడంచుఁ బేరు గొనియున్ గోప్యంబునన్ మధ్యానం
దునఁ బ్రాఁగాపుగ నుండుకూర్మము గనం దోరంబుతో నేగఁగాన్.

మ. అప్పు డావచ్చెడి కాకమూషికముల న్నాకూర్మముం గాంచి దూ
రపుచూపొప్ప నెదుర్కొనె న్ముదముతో రక్తి న్యథోక్తంబుగా
నపు డాతిథ్యము సేయఁ గాకము ముదం బందెం గడుం బ్రేమతో
నిపుణంబౌ మతితోడఁ బల్కె చెలికా నిం గాంచి పై పొంగఁగాన్.

సీ. అబ్జాకరంబును నజకుళీరవృషభ, మకరమీనంబుల మనికిపట్టు
పతగంబులకు నెళ్ళు పాటుల కిల్లును, సుమనోనికరముల నూతిగృహము
కుముదాకరంబును గమనీయమగుటచే, నాకస మిల కేగ ననఁగ నున్న
యీసరమున మీల నీగుచుండెడిమీస, కాఁడ వీవె కావె కమలవాస

గీ. నీదుపూర్వకృతము నెన్న నేను దగుదె
నలువ కైనను శక్యంబె నాగు కైన
మంచి సఖుఁడవు స్వర్గంబు మించి యుండె
సంచరించెద నిచ్చోట సఖుఁడ యనియె. ౧౭

గీ. అనియు మూషకమును జూపి ఘనుఁ డితండు
చాలకాలమునుండి నా జతనఁయుండె.
బుణ్యకర్ములలోన వరేణ్యుఁ డితఁడ
గణ్యగుణరత్నములకును పణ్యవీథి. ౧౮

క. పరఁగు హిరణ్యకుండన, పరగున వినవయ్య వీనిసరసము తెలియం
దరమే యజానికి నేనియు, నిర వీతఁడు సుగుణములకు నీఁడుం గనుదే. ౧౯

వ. అని హిరణ్యకుని మునుజరిగినవృత్తాంత మెల్ల నుత్తలపాటు హత్తక సత్త
ముఁడను పలుకుత్తరముగ నొత్తి పలికె నప్పలు కొప్పుగ నిక్కార్యంబు
విని యప్పుడె యాహిరణ్యకుని నిమ్మగు సమ్మానంబున నమ్మం జేసి
"రమ్మ నాయిమ్మునకు గ్రక్కున" నని తోడ్కొనిపోయి మీల మెక్కించి

చక్కఁగ నొకకలుఁగుఁ జూపి బస విడియించి దానిదగ్గఱఁ దానుం జేరి "నీకు వనం బిమ్మగుటకు కారణం బిమ్ముగఁ బల్కు" మన, నాహిరణ్యకుఁడు చిత్తంబున నానిమిత్తంబు హత్తించుక నత్తఱిఁ బల్కె సాఁగె. ౨౦

సీ. చంపకవతి యను నింపగుపత్తన
మదియు సన్యాసుల కాలయంబు
వారు బిచ్చపుటన్న మరయుచు నుందురు
శ్రుత్యంతవాదాలఁ జొక్కు చుండ్రు
చరలింగములె గాన చరియించు చుందురు
లింగదేహము గని పొంగుచుండ్రు
సంగహీనులు కావియంగవస్త్రము గట్టి
దండము చేఁబూని తిరలుచుందు.

గీ. రట్టివారలలో నుండె దిట్ట యొక్కఁ
డోగిరంబును దాఁ దిని వేగిరమున
నొంకెఁ దగిలించు మిగిలినయోగిరమును
బాత్రమందున నుంచియుఁ బదిలముగను. ౨౧

క. షద్దుం జేయక యొంకియ, యొద్దకు నే నేగి ముదము నొందుచు నన్నం
బొద్దికఁ దినఁగాఁ దద్దయు, నిద్దుర మేల్కనియుఁ గాంచి నివ్వెరమతితోన్.

క. ఎద్దం దలఁపఁగ నొక్కఁటి, యడ్డంబౌ దైవ మనుచు ననఘుఁడు మదిలోఁ
బడ్డనుడి నణఁగి సెజ్జం, గొడ్డగుపాట్టంట వెన్నుఁ గుదురుగ నుండెన్. ౨౩

మ. ఇటులుం గొన్నిదినంబులుం జనఁగ నూహించెం బరివ్రాజకుం
డిటు లేఁ జంపెద మూషకంబు నని తా హింసం బనర్థంబుగాఁ
జటులంబౌ మది నెంచి కఱ్ఱ నిల నిచ్చం గొట్టెఁ గొట్ట న్విసెన్
బటువాక్యంబులఁ బల్కెఁ దాఁ బదులు తో న్పాటించి దానిం దగన్. ౨౪

వ. ఓయిచూడాకర్ణ! నేను వీణాకర్ణుఁ డనువాఁడ నామాట నాలించి, యాలింపుము తొందర వలవదని వెండియు. ౨౫

గీ. ఏల నిట్టులు గఱ్ఱుచు నేలఁ దట్టె
ననుచు నడిగిన నెలుకొక్కఁ డన్నమునకు
నాస వచ్చెడు నని పల్క నతఁడు వినియుఁ
జిలుక కొయ్యకు నెగురంగ నెలుక కగునె. ౨౬

క. ఎలయెలుకకు నగునే యొం
కెల కెగయఁగ నేలనుండి యిలః జోద్యంబౌ
బలహైన్య ముపాధియు నొం
బలఁకందగు దోష మేమి పలుకుమ బుధుఁడా. ౨౭

ఉ. హేతు వుపాధిఁ గూడికొన హేయము వాక్యము నంద్రుగా బుధుల్
హేతువు వేఱుఁగాఁ గల దదేలనొ కందము దీని కొక్క స
త్హేతువు సెప్పెద న్వినుమి కేతనము న్విడనాడి భిక్షుకై
చేతను బాత్రఁబూని చనఁ జేరియుఁ బాలుడు నాటియొద్దకున్
నాతిరొ జొచ్చె నేఁడు తిథి నాణెము విప్రుల కన్నదానమా. ౨౮

చ. దానికి సంభరంబు గలదా యనఁ బాలుత పల్కె వానితోఁ
దేనిపదార్థ మెచ్చటను దెచ్చెద మీరుగఁ దెచ్చువారలున్
దే నని వండి తీరుగను దృప్తిగఁ బెట్టుట మాకుఁ జెల్లు నెం
తో నని నున్నవస్తుతతితోఁడనె జప్పు మనెం గడంకతోన్. ౨౯

మ. అనుఁడు బ్రాహ్మణి వల్లె యంచు నని యవ్యావస్తువుల్ సేర్చి వే
యనువొందం దిలలం గడుం గడిగి పోయం జాపపై నెండలో
నను దాఁ గాళ్లను జిమ్మికోడి దినఁగా నాణెంబుగాఁ జూచి తా
నెనయం గోపముతోనె దూరి యిలు నోసీ యే మిలం గోడి గా
ళ్లను జిమ్మెన్విడితోడ నంటువడియె న్లాభంబు లేదే యనెన్. 30

మ. అని యోసీ యిటు రమ్ము గన్కి చనుమీ యాలస్యముం జేయకే
గొనిర మెచ్చట నైన వేళ బదులుం గోప్యంబుగా నూవులం

గొనకున్నం బిత్రుకాల మేదు ననఁగా గూఢంబుగా గ్రుక్కుచుం
బనట న్నూవులపప్పు దెచ్చి పరుపంచన్ నిల్చి వేడెన్ సతిన్. 3౧

వ. ఓసెచ్చెలి! ఈపప్పుం గొని ముడినూవుల నిమ్మనుచుఁ బ్రార్థించె. 3౨

క. అంతనె యుప్పొంగుచు మది
బప్పుం గొని నూవు లడ్డై బదులుగ నిచ్చుం
జొప్పు గని యోయి వెఱ్ఱి
పప్పిచ్చియు నూవులడుగుపద్ధతిఁ గనుమా. 33

క. దంచని వివి, దంచిన వవి వంచనలేకుండ వీనిఁ బాయుట కగునే
చంచలమతివై యిచ్చెద నంచుం, బలికితివి యట్టు లాడం దగునే. 3౪

సీ. బాగుచేసియు నిచ్చెడిభావ మరయు, చెడకయిచ్చుట వెఱ్ఱికిం జేయనగునె
గానఁ బుచ్చుకో దగనవవ్వి గట్టిదాన, వనుచు భర్తయు మాన్పె నా యప్పు

గీ. ఆదె సపక్షము వినుము నీయదియు నట్లె (నివ్వ.
బల్కి నావాసములకును బలము వేలు
నాస గలుగఁగఁ గా దది యనఁగ నతఁడు
దోసకారిని వెదకెఁ గా నాస నపుడె. 3౫

వ. అట్లు వెదకి యోవీణాకర్ణా ఈదొంగయెలుక యిచ్చట నొకయలుగు సలు
పుకొ తెలుగక యుంటివికదా! ఇదె నీవు సెప్పంగఁ గన్నులారఁ
గంటి. త్రవ్వి చూచెద నని నా యార్జితోపార్జితంబగు కాణాచినుండి
సరస్వ మంది నిస్వుఁ జేసె. 3౬

క. తెచ్చినదానికి నిట్టులు, వచ్చినయిబ్బందిఁ జూచి వాడినమదినై
యిచ్చుం దెండెంగొనుటకు, నిచ్చయు జనియింపకుంటి నీవరకైనన్. 3౭

క. దిగులుం జెందియు నట్టులు, వగిపొందుచు నల్లనల్లవచ్చుచునుండన్
సగమునఁజూడాకర్ణుఁడు,మొగమెత్తియుఁ నన్నుఁజూచిముదముగదురగాన్.

క. ధనవంతుఁడె బలవంతుఁడు, ధనమే పాండిత్య మిచ్చు దైన్యము వాపున్,
ధనముండ నన్నియుండున్, ధన మేగిన నేగు; దాన ధనముండ నగున్.

సీ. ఈమూషికము ధన మిల్లఁగనే కదా మనుజవసత్వముల్ మునిగి తిరుగు
ధనము లేకున్కి ఖేదము గల్గు నెప్పుడు, ఖేదముచే బుద్ధి క్షీణ మగును
దానచేతకునగు న్యూనత నేఁజును, చండభానునికడు నెండఁ బోలె
మెండుగధనముండనండదండిగనుండు, పురుషకారమునుండుబుద్ధియుండుఁ

గీ. పుత్రమిత్రులు లేనియమ్మూర్ఖుమనసు
శూన్య మందురుగా బుధుల్ శూన్యమెల్ల
ధనము లేమన్నదాఁ జావుఁ గనుట మేలు
మరణ మప్పుడె లేమి యా మనుగడెల్ల. ౪౧

సీ. ఇంద్రియంబులు లేమి యిలలేమి గాదుగా
యింద్రత్వమును లేమి యిలను లేమి
యుండిన బుద్ధివాగుద్ధతినామముల్
పండును సర్వము పైక మేదఁ
గల్మి యుండఁ జలము చెల్మి యానది లేమి
చెలిమియుఁ జల మగుఁ జిత్ర మేమొ
యుండఁగఁ జం టుండు నొంటియా లేమిని
తారుమారులు సేయఁ దగును కల్మి
యుండఁగఁ గల్పనఁ బండఁగఁ బొట్ట నా
గట్టిది యీకల్మి చెట్ల నెక్క

గీ. కలిమిలేములచిత్రంబు దెలియనగునె
చెడ్డ వివి రెండు మిత్రునిఁ జేయఁ జెడ్డఁ
గలిమి స్వీయుఁడు లేమినిఁ గాడు గాదె
యనుచు నాబోడ యన మది హైన్య మొంది. ౪౨

సీ. ఇచ్చోదగదు నిల్వనీ గృహకృత్యంబు, చెప్పకోలును గూడ సిగ్గుపాటు
ధననాశమునుమనస్తాపము నింటిదుశ్చేష్టితమును బరుచేత వమ్ము
మహినిచెప్ప గనవమానమందురుబుధుల్ దైవమెదురగానే తగనువనము

పూసుత్రివలె నరుల్ పుడమిని శిరమునముండరా లేకున్న నంద యడవిఁ
బడవలె నిచ్చట బడుగట్లు పడియుంట పూవుల నమ్ముచోఁ బుడక లెట్లు
ద్రొక్కఁడి నొక్కఁడు చక్కఁ కన్నను మేను, నిప్పుల గప్పుట యొప్పుగాదె
యాడితప్పుటకంటె నానూరకుండుట, తిరియుట మేలు ని తరధనముల
నరయుటకంటెను నజ్ఞుని సభలోన సేవజేయుటకంటె సేమ మడవి
యాచించుకంటెను నగును చచ్చుట సేవ, జేయుటకంటెను సిగ్గులేదు. [కృ.
య బ్లైయాచ్నావృత్తి నూగారవము, జంపునొక రింటతినియున్కియుక్క నో

గీ. దానివలనను దుఃఖంబు తప్పకుండు, నడియునాశ్రయనాశంబు నగ్గివోలె
గలుగఁజేయునులోభంబుపలువయిలను ప్రజ్ఞగలవాడుదానలోఁబడఁడుగాదె

వ. పిమ్మట నచ్చోటు నే వదలకుండుటఁ గని చూడాకర్ణుండు గఱ్ఱ రివ్వున
విసర నా దెబ్బ దైవయోగంబునం దగులక దప్పె. అది తగిలినచో నప్పుడె
యుప్పరంబున కెగసియముచొప్పు గాన నతనిపురంబున నెప్పుడో
ప్రాఁగాపుగఁ గాపురం బొప్పఁగఁ జేయుచుండెన గదా. అట్లా దెబ్బ
తప్పించుకొని యిటులు చింతిలితి. ౭౭

ఉ. ఆపోధనలోభముచే, సాహస మంతయునుబోవు సత్యము దప్పున్
దేహము గాసిం జెందుం, దోహవ మేమానొ దీనిఁ దొలగించుటకున్. ౭౮

క. ఆపదలకు మూలం బిది, మాపును సుఖమెల్ల దీన మాన్యత దప్పున్
దాపగు గొప్పయు దెంపున, దోపవెభువిఁ దెఱకులెల్ల దోసమె దానన్.

క. కాసుకు నీచుం గోజక, దాసుండై ప్రాప్తమైన దానం దృప్తిం
జేసికొని యుండువాఁడే, దోసము లేనట్టివాఁడు దుర్లభుఁ డిలలో.

క. చాగం బిల సుఖ మిచ్చున్, భోగంబులు వృద్ధినొందు బుధుఁడౌ నిలలో
నీగియు దానం జేరున్, గాఁగలపనులెల్ల దానఁ గడ తేరునహో ౮౧

క. భూమిని నాటఁగ బీజము, వ్యోమమునందున ఫలంబు లొందవు తెఱగునన్
సామముతోఁ జాగము భువి, నామరుదాల యముఁ బోవనందు న్ఫలమున్.

క. కర్మమె మూలం బిలలో, నిర్మలులకు శర్మదంబు నీచుల కెల్లన్
మర్మద మగు నాకర్మపు, మర్మము దెలియంగ రాదు మహి నెవ్వరికిన్.

సీ. ఈతావు మన పెద్ద లీగుచున్నది గాదు
తావు చిక్కదె దీని తప్పి చనిన
నిచ్చట నీచెడ్డ భిక్షునిచేఁ గట్టి
మోదులం బ్రాణము లుజ్జగియ నేల
చనియెద మడమున జనశూన్యవనికిని
శిల నున్న బ్రతుకదె చిన్నకప్ప
పాలకు దయ యుండఁ బ్రక్కనుండిన నేమి
తనవారు వడ్డింపఁ దగదె తుదయు

గీ. ననుచు మనమున గట్టిగ మనన మొంది
యట్టివిడిదిని విడిచియు ననఘుచరిత
జనము లేనివనంబున మనుచు నుంటి
ధనము లేకున్న జనులతో నునికి తగదు. ౫౧

గీ. నాదు భాగ్యంబుచేఁ గాకి నాకు మిత్ర
మగుచు నుండెఁగ మైత్రికి నమరె ఫలము
మేలు గలుగదె మాన్యుల మేలనమున
జన్మఫల మిల సజ్జనసంగమంబె. ౫౨

క. సంసృతియను వృక్షంబున, హంసంబై మనెడువాని కందెడుఫలముల్
ధ్వంసముచెందక భువి వి, ద్వాంసులసంగతియుఁ గావ్యవశతయు రెండే. ౫౩

గీ. మూఁడుచోట్లను విశ్రాంతి ముదముఁ జెందు
మూఁడుకాకలచేఁ దాప మొందువాఁడు
మంచిపుత్రుల మిత్రుల మగువలందు
భువిని సూర్యాగ్నిచంద్రుల పురుడు దోప. ౫౪

క. అర్థ మనిత్యం బగు భువి, వ్యర్థము యౌవనము వంకవంకయుఁ బోలెన్
సార్థక మొందం దగు న, వ్యర్థంబగుధర్మనియతి కావాసుండై. ౫౫

క. బుద్బుదముల్ జీవనములు, సద్బుద్ధిని ధర్మమిలను సాధింప నగున్.
సద్బుధుఁ డిట్టులు సేయమి నుర్బంధన మొంది శోక మొందుం బిదపన్.

సీ. వంక లేనిమడుపు సంకట మొందును, తెగువలేనిధనము దేట కాదు
విడుపు లేకయుఁగట్టి కడుపు సమార్జించి, పెఱవారలకుమోపు మొఱకుమోయు
త్యాగభోగము లేక దాఁచిన యీగియు భూగతంబగు గాని భోగ మెట్లు
నిండినగుంటకు నీరు పెట్టిన తెగు, సద్ధస్తదానంబు నిద్ధ మగును

గీ. చుట్టముల కిడకయుఁ దనపొట్ట కిడక, పెట్టుపోతలచే పేదపొట్ట కిడక
గట్టిపెట్టిన యర్థంబు దిట్ట మగునె వట్టిఁగలయును దొంగల గుట్టుఁ జేరు.

క. దానము ప్రియవాక్కులతో, జ్ఞానము గరువంబు లేక నాణెం బగుగా
మానము శమయుతమగు సం, ధానమున ధనము పాత్రదానము గలుగన్.

గీ. చాగ ముండిన నీగికి భోగ ముండు
రాగ ముండినదానికి భోగ మెట్లు
తొల్లి లోభముచే నక్క విల్లుఁ గొఱికి
మోస మొందెను గనయము దూసి పడఁగ. ౫౯

వ. ఆకథఁ జెప్పెద నవధరింపుము. ఓమూషికరాజా! మున్ను సమస్తకల్యా
ణంబుల కాకరంబగు భైరవుండను నొకబోయండు వేటకై వింధ్యాటవికి
వేటకుక్కలును విల్లు తూపులు జాలంబు లుచ్చులు ననగు నుపాయంబు
లపాయంబు లేకుండఁ గొనిపోయి పొంచి మృగములసంచరియెచ్చ యచ్చం
బుగ మది ముచ్చటింప మృగములమోసపుచ్చు నాసదోసంబున వది
గావించుకొని యుండె. ౬౦

గీ. పాతరించిన మెకము నాపాదువులోన
గూఁతలిడుచును లోఁతుగఁ గూలఁబడఁగ

కోల నేసియు నఱకటఁ గొనుచు రాఁగ
బంది నడకొండవలెఁ గానఁ బడియెఁ ద్రోవ. ౬౧

సీ. అంత నాబోయండు సంతస మొందుచు
పిశితమందున బ్రేమ పిశునుఁ డగుచు
చెట్టు వింటిని బట్టి బెట్టి బాణము వింట
గట్టిఁగ నేయంగ నుట్టిపడుచు
శరముపెంటనె వచ్చి ఘురఘురధ్వనులతో
గొట్టెఁ గొమ్మున వ్యాధుఁ గోపవశత
మొదలు గొట్టిన చెట్టు మ్రొగ్గినచందాన
కోలుచు బోయండు నేలఁ బడియె

గీ. పంది గాఁడఁగ శరము వే పడియె నేలఁ
బక్క సర్పము వీరల ద్రొక్కుడులను
మడిసె మువ్వుర కిట్టులు మరణ మాయె
దీర్ఘరావంబ నెడినక్క దీనిఁ జూచి. ౬౨

గీ. మూఁడు నెలలకు బువ్వయుఁ గూడె నేఁడు
గొంతుబంటిఁగఁ దినుటకుఁ గొఱత లేదు
మాస మొక్కఁడు బోయని మాంస ముండు
మేకము పందియు రెండును మిగత రెండు. ౬౩

గీ. దినము గడపుట కీపాముఁ దినెద ననుచు
సంచయేచ్ఛను భాగముల్ పంచుకొనుచు
తొంటియాఁకలిఁ దీర్చెద వింటినారి
ననుచుఁ బంటను నొక్కెను గుణము నపుడె. ౬౪

క. గొనయము వదలెం బెట్టును, గనయము పెట్టంబె నెదను ఘనముగవఱదుకా
మనమునఁ గోర్కులతోడనె, తనువునఁ బ్రాణములువదలిత టుకునఁజచ్చెన్.

గీ. ఘనుల నైనను లోభంబు గడకుఁ ద్రోలు
యుక్తిఁ దెలిసిన నక్కయు ముక్తిఁ జెందె
నేర్పు గలిగియు వేఁటలదీర్పుగాఁడు
మరణ మొందెను బందిచె మాట లేల? ౭౭

గీ. పరుల కిచ్చుచుఁ దాఁ దిన నరుగు దివికి
నొరుల కివ్వక తాఁ దిన కఱుగు భువిని
లేఁకు వెప్పుడు జనులకుఁ దేట గాదె
లుబ్ధతయు నుండ భువిలోన లబ్ధిఁ జెఱుచు. ౭౮

గీ. దవ్వునకు నేగు కార్యంబు ద్రవ్వ నేల, బుద్ధిమంతులు దానినిఁ బూడ్తురిలను
గతము గూర్చియు వగచెడికష్టు లిలను కష్ట మొంది వితాకునభ్రష్టులెపుడు.

క. కావున మిత్రుఁడ నీ విపు, డీనగపుం దక్కయుత్సహింపుము మదిలో
భూవినుత యెంతఁ జదివిన, నావిద్దె తెఱంగు దెలియ దవని నెవరికిన్.

క. చదువుల తెఱఁగునఁ జనుటయు, చదువరులకు మంచి దెపుడు సనకుండినచో
బదిలము సేసిన నౌషధ, మది దినకుండంగ రోగ మణఁగదు భువిలో. ౮౦

క. జ్ఞానము గలిగిన నే మగు, దానిం గ్రియ గూర్ప నగును ధన్యత శాస్త్ర
జ్ఞానము వివేకహీనత గాన ని వానికిని ముందు గాకడఁబోలున్. ౮౧

క. ఆపద వగవందగ దిఁ, జూపుటయును దగదు పొంగు శుభముల వెంటన్
జూపించుచు సమబుద్ధిని, ప్రాప్తింపఁగ రెంటి నంటఁ బ్రాజ్ఞుఁడు సుమ్మీ.

సీ. ధనము నిత్యము గాదు దాని నాశంబున, వగవఁ గా నగునె యావంతయైన
అర్థహీనుం డిల వ్యర్థుఁ డన్మాట శ బ్దార్థపరము గాని ధనము కగునె
పుష్కలధనమున్నఁ బుట్టదు క్షుద్రుని, కిల గౌరవంబున కిక్క యగుట
సింహమందుం డెడిచేవయు శౌర్యమున్ గలుగునె వేఁపికిఁ గనక మిడిన
బుద్ధిమంతుఁడ వీవు బోయెనె యింతట గౌరవంబును జన్మకల్పకుండు

గీ. బువ్వఁ గల్పింపఁ నోపఁ డెపుణ్యచరిత, జూడు పుడమిని జంతువు సూతిఁ జెందు
తఱిని తల్లికిఁ జన్నుల వఱలుఁ బాలు, జీవనంబున కలసటఁ జెంద నేల ౮౩

గీ. నీళ్లలోఁగాని పుడమి నే నిల్వఁ జాల నీవు పుడమిని లాఁగలఁ బోవువాఁడ
వాతఁడాక సమం బెడిచేఁతకాఁడు,ముప్పురనుగూర్చిదైవంబుమూఁడుగతుల.

గీ. ఒక్కచోటనె చిక్కఁగ నున్కి గల్గె
నిక్కఁ జేసుకొ యిక్కడఁ జిక్కు తొలఁగు
సక్కె మొందియు నిక్కుచు నుక్కు మీఱి
యుంద మిం దేల వగపును జెంద మనకు. ౭౫

గీ. తినఁగ నిచ్చట మిక్కిలి తిండి గలదు,నన్నుఁజూడుము లఘుపతనక ముకరణి
ననినఁ దాను హిరణ్యకుఁ డనియె నగుచు,మిత్త్రనీవచనామృత చిత్రవృష్టి.

గీ. నాదుమానసతాపాగ్ని నేఁడు జేసె, ధన్యుఁడను మిత్రసంపద తనరె నాకు
మైత్రిలక్షణమున కీవు మార్గదర్శ,కుడవు నేఁటికి దృష్టాంత మడరె నాకు.

సీ. అంచల చిలుకల నానెమిళ్ల ధవళ హరిత చిత్రంబుల హాయి నెవఁడు
సృజియించి వాని సుస్థిరముగఁ దగినట్టి వృత్తిని గల్పించు వీలుగాను
దానిఁ గానక మోటుతనమున జను లెల్ల వృత్తికై పాట్లలోఁ జొత్తు రిలను
రాతి నుండెడి కప్ప రీతిగఁ జీవనం, బెప్పుడు జనితోడ నొప్పుచుండు

గీ. గనుక ముప్పుర మీగుంట గట్టుచేర, జీవనంబును బూత్తిఁగఁ జేరు మనకు
మనల ముప్పురఁ గూర్చిన మాన్యుఁడైన,దైవ మివ్వఁడె తిండిని దైన్యమేల.

వ. అనుచు ముచ్చటించు నాముప్పురుం బురుషోత్తముంబలె గమలాకరంబును బ్రహ్మనుంబోలె సర్వతోముఖయుతంబును, శివునింబలె సర్వాభరణంబును నగుటచేఁ ద్రిమూర్త్యాత్మకంబగు సరోవరంబున పరస్పరస్నేహజనితానందనిమగ్నమానసులై కాలంబు గడపుచుండిరి.

సీ. ఆధారమందున నస్థిరూపం బయ్యు మఱియు నధిష్ఠాన ముఱికిభాతి
యై రెంటఁ బరరూప మాదియై గలిగియు,పూరించి మణిపూరభూఁభువిని
పశ్యంతి యై ప్రియము దృశ్యమై వ్రణులనలంకరించుకొయనాహతముఁజేరి
మధ్యమ యగుచు నామమున ననాహత,నృత్తంబు సల్పి నిమిత్త మగుచు

గీ. వైఖరీరూప మై తాను వైభవమున
కారియంబును వ్యవహార కారణంబు
నగుచు నుండినయజుకాంత నాపికొందు
భవము నెడఁబాపి నను జేయు భద్రు నెపుడు.

గద్యము. ఇది వేంపటాన్వయరాకాసుధాకరుండును వైదికమార్గ
ప్రవర్తకుండునగు చినస్వామిశాస్త్రికి నాగమాంబాగర్భ
శుక్తిముక్తాఫలంబై జనిర్మించినకుటుంబయ్య
శాస్త్రిచే రచియింపంబడిన మిత్రలాభము
నందుఁ గాకమూషికములు మదువుననున్న
కూర్మముం గలయూట యనుకథగల
తృతీయగుచ్ఛము ముగిసెను.

---

# మిత్రలాభము



## చతుర్థగుచ్ఛము

సీ. ఆధార మాదిగా నావఙ్ఞలముదాఁక, నాపరారూపమై యాడుచుండి
యాపైని పశ్యంతి యై మణిపూరంపు, నవమణిజాలంపుటననిఁ జేరి
మణులకాంతులచేత మైనిండఁగ వెడలి, మధ్యమయను పేర మాన్యయగుచు
నాయనాహతమందు నాహతిలేకుండ, నాట్య మాడుచు సర్వనాదులుండు

గీ. షోడశారముఁ దాఁ జేరి శుద్ధి నొంది,
వైఖరీరూపయునను వాగ్వాగ మొందు
పలుకురాణిని మదిలోన భక్తిఁ గొలతు
దాన మా కబ్బు సంపద దైన్య మేద. ౧

వ. ఇటులు కాకకూర్మమూషికములు మూఁడు మడువునందు. మైత్రి మెలఁగుచుండ నొకనాఁడు వ్యాధునిచేఁ దఱుమఁబడి యొకజింక పఱువిడుచు నీకొలనిగట్టునకుం జేరి యచ్చట నిలిచె. నంత గాకం బంబరంబున కెగసె. నెల్లయు నిల దూఁకె, నాతాబేటిమేటి కమలాకరంబుఁ జొచ్చె. ౨

క. కాకం బపు డాకసముం, డీకొని వృక్షాగ్ర మెక్కి డెందము చెదరన్
తేఁకువతో నలుదిక్కులు, వే కడు సడ్డయును దోఁప వీక్షించెఁ బసన్. ౩

క. వీక్షించి యుభయకారణ, మాక్షణమునఁ గాన కెచట నన టఱఁగంగా
వీక్షించితి నలుదెసలున్, వీక్షణముం జనెడుదనుక వెఱవకుఁ డింకన్. ౪

వ. అని మంథరహిరణ్యకులం బిలిచి కాకంబు పలికిన తమతమ నెలవులగు బిలజలంబుల విడిచి భయముం దప్పియున్న కచ్ఛపమూషికంబులు గడగడవణఁ

కు నాజింకం గని నీ వెవ్వండవని యడుగ నాజింక నా పేరు చిత్రాంగు
డని యిట్లనియె. ౫

ఆ. మిత్త్రులార నన్ను సత్రాసు గావరె, శత్రుచేతఁ జిక్కి చావనుంటి
దాగుట కొక కొంత తావును జూపరే, దుష్టుచేతిచావు దొలఁగుటకును. ౬

ఆ. శరణుసొచ్చువాని సరగునఁ బ్రోచుట
సరసులకును మిఁగుల సహజగుణము
మర్త్య మెడలి నాదుమానముఁ గావుఁడీ,
మానితాత్ములార? మహిమఁ గనుఁడుఁ. ౭

ఆ. అనుచు మృగము వలుక నాకాకమూషిక
కూర్మములును బలికె నిర్మలముగ
శర్మ నుండు మిచట నర్మము లాడుచు
భర్మసదృశ! నీవు భవ్యమతివి. ౮

క. కమలావాసంబగుటను, కమలము నీ వగుటచేతఁ గారుణ్యముతో
విమలంబగు చిత్తమునం, గమలాపతికమలధరులు గాచెద రిచటన్. ౯

వ. ఇట్లు వలికి యాకాకకూర్మ మూషికంబులు నా మృగముచెలిమిం గొని
యుండ నొకనా డామృగము దూరపుకొండ నునుపనుసామ్యము నిజము
చేయఁ బచ్చికదట్టమైనటులు దూరంబునకుఁ గాన్పింపఁ జొంపములుగ బచ్చిక
యున్నదనుభ్రాంతిచే దూరపుబీటికి మేఁతమేయం జేరి. యొకవ్యాధు
వలం జిక్కి యిట్టులు చింతిల్లె. ౧౦

క. వలలను ఖండించెడియా, బలవంతపు మూషికంబు బాసి యిటుఁలు నీ
యిలఁజేరి దూర మైతిని, మలినుండగు బోయచేతిమాయం బడితిన్. ౧౧

క. లఘుపతనక మను కాకము, లఘుగతి నిట కేగి నాదులయగతిఁ గనిన
న్నఘహరమగు నాయెలుకను, లఘుగతితోఁదెచ్చునిటకులాఁగకుజనితోన్.

వ. అని దిక్కులు వీక్షించు డంతలోనఁ బతంగుండు బతంగంబులపగిది నిమ్ముఁ
జేరె. ఆవ్యాధుండును వలం జిక్కిన జింక యొచ్చుడి కేగునను ధైర్యంబు

తో మఱల వచ్చి భద్రపటుతమను నాశయముతో బోనంబు గొనుట
కిలు సేరె. ౧౩

సీ. కాలకైవర్తుండు కటికచీకటివల
  గైకొనినక్షత్ర గణము లనెడు
నాళెంపురత్నముల్ నయముతో డుతఁ దెచ్చి
  యంబరమనెడు నా యంతి పురము
రాజుఁ బొందు నటంచు రమణీయముగఁ జేసె
  ననఁగ జుక్కలు దివి నంటె నపుడె
దినమణి తేజంబు దీవెలై భువి వెల్గె
  నగ్నికణములందు నలరె ననఁగ
గీ. నట్టితతికిని మృగ మిల్లు పట్టు కునికి
గనియుఁ గూర్మంబు గాకిఁ దా ననియె నిట్లు
మృగము నిలుఁజేర కుండెఁగా మేఁతకేగి
మనము గలుషము నొందె వేకనుము ద్రోవ. ౧౪

వ. అని యిచ్చట కాకకూర్మమూషికంబులు గలవలపడుచుండె వచ్చట నా
మెకంబును. ౧౫

క. వ్యాధుండు జొచ్చెఁ దా నిలు, బాధింపక నన్ను విడిచి పామరమతితో
బాధం బాపఁగ నావా, గోభధ న్వినువారు లేరు పుణ్య మిదేమో. ౧౬

క. బోయనిరాకకు మును నే,
భోయని యరచినను వినియుఁ బ్రోవఁగ నన్నున్
సాయముఁ జేసెడివారలు
నీయవసరమునను దూర మీశ్వరుఁడెగదా. ౧౭

వ. అనుచు నా మెకం బచ్చో బ్రసుక్కుచుండ నిచ్చో నా కాకమూషికంబు
లంగని కూర్మం బిట్లనియె. ౧౮

క. మననెచ్చెలి చిత్రాంగుఁడు,
వని యడవుల మేత మేయఁ జాలఁ దడసెఁ గా
విను మేఁతలకుం బోయియుఁ
జను నెరలను మాని గూండ్లఁ జనువునఁ బక్షుల్. ౧౯

క. వ్రేలుం ద్రేపుల మేపియుఁ
ద్రోలుకొ పల్లియల కేగురోజా ముగియఁగా
నీలు్బుఁడు పచ్చికచవిఁ
గ్రోలుచు నున్నాఁడొ యెచట రూఢిఁగఁ గనుడీ. ౨౦

క. నూరుఁడు వారుణిదిక్కున
దారుచుఁజల్లారుచుండెఁ దాపము హృది నా
కారకఁ బెల్లగుచుండెన్
దూరము పోయియును వానిత్రోవం గనుడీ. ౨౧

గీ. నిమ్ము బంచిన నాదుమనమ్ము నిచట
తిరుగఁ జేరెడుదనుకను దిగులు నొందు
నేమిసేయుదు నని కంట నిడఁగ నీరు
ననియె వానికిఁ గాకము ఘనతఁ దోప. ౨౨

క. కొందలపడకుము నీవున, మందము నాజవము దాన మంథర వినుమా
పొందెద బహుయోజనములు,మందంబగుగతిని తిరిగి మరలెదను వెసన్. ౨౩

క. వెదకి వచ్చెదఁ జిత్రాంగు వెఱపు గొనకు
వానివృత్తము దెలిపెద వమ్మ లేక
యనుచు నెగిరియు నాయర ణ్యంబు వెదకి
యొక్కచోటున నురులలోఁ జిక్కువడియు. ౨౪

గీ. ఉన్నచిత్రాంగునిం జూచి కన్నునీరు
గార్చికొని చేరి చేరువ నోర్చికొనుచు

పరులసొమ్ములపై నాస పడవు నీవు
పరుల బాధింపఁగా బోవు పాప మెపుడు. ౨౫

సీ. అడవి లేఁబచ్చిక లరయుచుండెద వీవు
పడియలో నీరును బడయు దీవు
తడయక నీడలఁ బడియుండి ప్రొద్దుఁబు
త్తువు నీవు నొరు గీడు తోవ యెఱుఁగ
వటుఁగాన నీవంటియమల మనస్కున
కిటు లాపదయు గల్గె నెటులు నూతు
నెట్టివారికి నైన నట్టిఁగఁ దప్పదు
దైవవిహితమును దాఁట నగునె

గీ. వచ్చియున్నట్టి వగపుకై వగవ నేల
వగచువారల కెపు డది వమ్ముఁ దలఁచు
చేయఁ గలిగిన వెరవును జెపుము నాకు
మంథరాదులు గాచుక మసలుచుండ్రు. ౨౬

క. అని చెప్పఁగఁ జిత్రాంగుఁడు, విని వేగమ బోయడిటకు వెడలకమున్నే
చని తప్పింప నుపాయము, గని చేయుఁడు చేయకున్న గానరు నన్నున్.

క. హెచ్చరికను మనచెచ్చెలి, యెచ్చట నుండినను నేగి యిచ్చోఁ జేరం
జెచ్చెరఁ జేయుము దానన్, విచ్చను నాయుచ్చు లపుడె వృద్ధియుగలుఁగన్

సీ. అనియు జింక వలుక నాకాక మప్పుడె
కూర్మముండు కొలనుఁ గూర్మి నేగి
మర్మమెల్లఁ దెలిసి మరలివచ్చితి నెల్క
గొనిపోవ నిటకని వినఁగఁ బలికె
యెలుకను గని తాను నెలమితో మన మిత్ర
జింక యుండెడిచోటు చేరవలయు

నా వేగమును నీవు ననుసరింపఁగఁ జాల
వింతలో నేమియు దంత మొక్కొ.

గీ. నాదువీపున నుండుము నయము మీఱ
జింకయిక్కకు నిను జేర్తుఁ జెనఁక కనుచు
ఝింగుమని యెదుఱ్ప్రాఁతయుఁ జెక్కఁ దోప
బాణవేగముతో నేగె బలిమితోడ. ౨౯

సీ. చిత్రాంగుదాపున చిత్రముగా దిగి
వ్రాలె నక్కలసద్దు వఱలునట్లు
నక్కలసద్దున దిక్కు లెల్లను జూచి
దిక్కు నాకుఁ గలిగెఁ జొక్క నేల
యనుచుఁ జింక తనదుమనమున నుప్పొంగి
చిరజీవులగుడు ప్రసిద్ధిగాను
అని దీవెన లొసంగి యాయెల్కఁ జూచి క
న్నీరు గాఱఁగ నేడ్వ నెనరు గల్గి

గీ. బంధ మెడబాపి యిబ్బందిఁ బాపు మీవు
బుద్ధిమంతుఁడ వీయూరిఁ బొంది తిటులు
ననఁగఁ గాకము విని వెస నరుగకలయు
నిలుపరా దిట ముచ్చట నిలుపు మనియె. ౩౦

గీ. అదియు విని యెల్క వేగమె పదిలముగను
బంధ మెడలించి వెంటనె పయన మగుడు
వాని వెంటనె మినుబట్టి వాయసంబు
త్రోవ నేగఁగ నిలుత్రోవఁ రూఢిజనుచు ౩౧

ద్వి. అప్పుడు చిత్రాంగుఁ డాహితన్యాయుని
నొప్పుగఁ జూచియు నుడివెద వినుము. ౩౨

బుద్ధిగల్గినఁ గాని బుద్ధి లేకున్న
బద్ధుఁడు గావలె భాగ్యభోగ్యముల. ౩౩
ఏకాలమం దేది యొసఁగునో దాని
నాకాలమందున నందంగఁ దగును. ౩౪
ప్రాణులు సుఖదుఃఖపరవశు లెపుడు
నాణవ మైనను నటుద్రోయఁ రాదు ౩౫
షణ్మాసములు నాకుఁ జరుగుచు నుండ
విణ్మూత్రములచొప్పు వీసుచు నుండ. ౩౬
పిలుకుమార్పఁగ నను పిన్నతనమునను
పలుమాఱు పట్టంగఁ బచ్చికఁ దెచ్చి ౩౭
మచ్చికఁ బెట్టియు మాటున దాగి
నచ్చికఁ జూపియు నమ్మించె నన్ను. ౩౮
పిన్నతనంబునఁ జేరెము వాటి
యున్నపదువుఁ దప్పి యుట్టిపాటునను. ౩౯
చౌకళించుచు దాఁటి చయ్యన యురిని
నాఁకలి మచ్చు మేయంగను జొచ్చి. ౪౦
భయమొంది కూఁతను బరఁగఁ బెట్టఁగఁగ
వయుమేఁత మెకములు వాసి యంతటను. ౪౧
చెవులను నిక్కించి చెచ్చెరఁ జూచి
దవుదవ్వులనె నుండి దాఁటె నిక్కలను. ౪౨
చట్టుపైఁ గొట్టినచట్టియపగిది
పుట్టుబిడ్డలతోడఁ పొక్కుచు మదిని. ౪౩
అంతట వేఁటకాఁ డాపొదమాటు
జింతఁపప్పియు విడి చెంతఁ జేరఁగను. ౪౪

శిశువును పదువును చెదిరి వచ్చితిని
బంధములోఁ జిక్కి బడలి యుంటినిగ. ౪౫
యము జూచినట్లు నే నడరి చూచితిని
భ్రమఁ జెంది యుంటిని ప్రాణముల్ సెదర. ౪౬
పిదప నాబోయండు పెట్టె నామెడను
ముదముగదురఁగఁ ద్రాడు మోహంబుతోడ. ౪౭
నోవకుండఁగ నురి నుండి తప్పించె.
జావును దప్పేఁగా చయ్యన నపుడు. ౪౮
ఆయువుండుటచేత నాబోయచేత
నాయనకడఁగిన నాచేఁతగాదె. ౪౯
అంతట నతఁడు న న్నటకఁ బెట్టి
వింతఁగఁ గొనిపోయి వేగఁ బొంగుచును. ౫౦
రాకొమరునకును రయమున నిచ్చె
చేకొని యాతండు చిరునగ వొలయ. ౫౧
సాహిణమెదురుగ సావిటి లోను
రోహిణమును నన్ను రూఢిఁ గట్టించె. ౫౨
అదనుదప్పక దీని కాహార మిడుఁడు
ఇదియె మీపనియని యెదురుగాఁ బలికి. ౫౩
లెంకలతోడను లేచి చనియెను
పొంకముతో నాదుపుణ్యంబు చేత. ౫౪
పిదప నాయందున ప్రేముడి గలిగి
వదలక సేమంబు వాకొనుచుండె ౫౫
అంతట నానాఁట నలవడఁ గాసె
సంతసమొందిన సామి యానతిని. ౫౬

సరగున బంధంబు సడలించి భటులు
తిరుగ విచ్చలవిడిఁ దెగువతో విడువ. ౫౭
బెదరు విడిచియు నేన్బిడ్డలపగిది
వదలక మనుజుల నఱలుచు నుంటి. ౫౮
తోపుల దొడ్లను తొందరలేక
తేప మచ్చిక గల్గి తినెదఁ బచ్చికల. ౫౯
కొలకులఁ ద్రావుచుఁ గొంతకాలంబు
నలసట నీడల నాడుచుండెదను. ౬౦
కొంత వడిఁ బడియుఁ గొమరొప్పఁ గాను
చింత వీడి నెమరు చేఁతతో నుందు. ౬౧
సంజకాలంబున సరసుగట్టునకు
సరగునఁ జేరియు సంచరించితిని. ౬౨
కోయని బాలురు కూఁతలు వెట్ట
వెన్నంటి తరుమఁగా నెఱఁగంది నేను. ౬౩
పేరెమువాటియుఁ బెల్లున నడరి
పరఁగ నుద్యానంబు బాటిఁ జొచ్చితిని. ౬౪
చన రాణివాసపుఁ జానలు నన్ను
గొనిపోయి రాఁబట్టి కుదురుగనుండు. ౬౫
నేమున నతనికిఁ గీలించె నెదుట
రమణీయరత్నంపురాట రంజిల్ల. ౬౬
కనుబ్రాము చప్పుడె కమనీయ మగుచు
కనులకు నొరపున కనకంబు బోలె. ౬౭
మించులు మించనా మీఁదను నుఱుము
సంచరింపఁగ వాద్యసంభ్రమ మడర. ౬౮

తఱియను గర్తయుఁ దగఁగూడి యుండి
మెఱపున స్నానతో మేఘవాతముల. ౧౯
భూమియ స్నటను భూరుహంబులను
సమరిచిపోయంగ నామింటికెపనట. ౨౦
పుడమికుండయు నిండి పురపురపొంగి
నడిచె పుణ్యాహంబు నలుదిక్కులందు. ౨౧
మెఱపుతీవెలు దివి మెఱయుచు నుండె
తఱి నిలఁ దీవెలు దరులును మెఱసె. ౨౨
ఇనకరమును దివి నీగుటఁదప్పె
ఇనకరమును భువి నీగుట తప్పె. ౨౩
వాన మిన్నడెనె న స్వాదువునఁ గురియ
మిన్నుమన్నేకమై మెలఁగుచు నుండె. ౨౪
వర్షకాలపుచదువాయె బాలురకు
వర్షకాలపుచదు వనునాయ మడర. ౨౫
అంబరాంబరమున నమరనాథుండు
నంబువు వడపోసి యమరిచె నిలను. ౨౬
పశువులు బీండ్లలోఁ బచ్చిక విడిచి
శిశువులతో నిలు జేరఁగా మరలె. ౨౭
పక్షులు గూండ్లలోఁ బదిలమై గ్రుడ్ల
రక్షించుచుండె నాఋతుకాలమందు ౨౮
అప్పుడు నేఁ గుతూహలముతో డుతను
చెప్పనోపని ప్రీతిఁ జిందురులాడ. ౨౯
మానిసిఘాసను మది నిటులంటి
వానచినుకులు మైపరలుచునుండ. ౩౦

మెల్లనిచల్లనిమేఘువాతంబు
పెల్లునఁ బొలయఁగా పేరెమువాఱె. ౨౧
చిన్నియడుగులతోఁ జిందులాడుచును
విన్నబోయి బెదరువీక్షణంబులను. ౨౨
అప్పుడుబుట్టిన యాకదంబముల
నొప్పుగ మేసియు నొప్పఁ జోద్యంబు. ౨౩
విచ్చలవిడిగను వీనులు నిక్క
పచ్చని బీండ్లలోఁ బాఱెడు కలిమి ౨౪
వెండియు నా కెడ్డు వెలయునో యనుచు
వాడుకతో మది వదరితి నపుడు. ౨౫
ఆవశ రారాజు నాలించె వేగ
నావసారను నుండి యాచమించుచును. ౨౬
ఆలించుఁడును వెంట నాదుకయున్న
యాలెంకతో ననె నాయువరాజు. ౨౭
ఇచ్చొ వింతమాట యీగెఁ గా చెవుల
పచ్చనిబచ్చిక పరఁగమేయుచును. ౨౮
విచ్చలవిడి జింక వీగుచునుండె
నచ్చముగా నెవ్వ ర న్యులు లేరు ౨౯
నీవొండె నేనొండె నిలచియు గనుము
ఎవరును లేరుగ నీవార్త పలుక ౩౦
మాటలు వినినచో మానవభామ
వీటి నొండె మెకము వీగుచునుండె ౩౧
వింటివే యీవింత విశదంబుగాను
కంటివె కనులతోఁ గఱవు దీరంగ. ౩౨

వ. ఈమెక పుముఖంబునసె యీసుఖపుపలుకు శుకమునకుంబోలె నేతెంచెని
నామనంబు నందీసుచున్నది. ఓయీ నీవరసితవా దీనియరపు నొరసి
యని సరసంపు వాకుల నింపు సొంపొదవ నారాజుపట్టి వటికి ననుష్ఠి
నాలెంక శాంకముతో విని యోయేలికా! నీమనంబున మఱంగినయది
కొఱంతయగునె వినుమీ? ఈయదియే యీకోరిక కాకరంబగుగాని మా
నిసి కిది మదిమెలవనోపునె యని యాతండు మందలింప నారాకొమ
రుండు లెస్సయని యంగీకరించి యంతిపురంబుననింతులతో నాశేయి
గడపి రేపకడఁ బేరోలగంబుంజేరి జీవనవర్తనంబుల వెలయించు జ్యోతిషి
కులఁ బిలిపించి వినయపూర్వకంబుగా విద్వాంసుల పదపద్మంబుల కెఱఁగి
మెకంబుమొగంబున వెడలినమొఱ బిరబిర దెలిపిన నవ్వారలు విని మెకపు
మోమునమానిసివలుకొల యించిన మన్నింపం దగదు. దాని గొంపోయి
కానల విడువుండు నియమంబున జపహోమాదుల జరుపుండని నియమము
తోడఁ బలుక నారాకొమరుం డది విని యట్లు నుద్యమింప, పిదప నావిదు
షులు నారాచకొమరునితో మఱియు నిట్లనిరి. ౯౩

ద్వి. నిండిన యింటిలో నిలుపఁగా రాదు
పండినయింటను పడుకడగండ్లు. ౯౪

నొరఁగెదరింటను ద్రోసి యీమెకము
వెరవున వెంటనె తరలింపుడనిరి. ౯౫

అటులుబల్కఁగ నతం డాక్షణంబునసె
చటుకున నను నడవి చాయలకంప. ౯౬

నాన తిచ్చెను భటుల కాకాలమునసె
నాణెముగా దనిన నగుభయమిలను. ౯౭

క. అంతట రాకొమరుండును, నంతిపురంబునను నుండి యాడెడు నన్ను
న్నంతనమున దిగులొందుచు, చెంతం దూరంపుటడవిఁ జేర్పగఁ బంపెన్.

క. పదపడి నే నాయటవిని, సదమలమతితోడ నుండఁ జయ్యన బోయం
డది గని పట్టఁగ నన్నుం, బసలముగాఁ బొంచి యుండఁ బాఱితినిటకున్.

క. నేఁ డిచ్చట నీదయచే, వేడుక నాకయ్యె మనని వేగని నిన్నుం
బాడియె సాంగుట యింతం, జూడుము తొలిబాము లెట్లు జొచ్చునొ మేనన్

సీ. ఓబుద్ధిశాలి! నీయోర్పు నెల్లను వింటి,
మంథరుఁడను మేటి మైత్రి నొంది
కాకంబు జెప్పఁగా గలిగెఁగా నీమైత్రి
మైత్రికి ఫల మిప్డు మసలె నాకు
గాన కష్టము లేనిఘనుఁ డెవ్వఁ డిలలోన
దైవగతి కెవఁడు దాడి వెడలు
నీయిడుమలవిని నేవంతఁ బడుచుండ
నాకు నీయిడుమలరాక గలిగె ౧౦౧

గీ. ఇటులు నుండఁగ నచ్చటఁ జటులమతిని
వీర లింతకు రారైరి కారియంబు
నడ్డు నొందక జరిగెనో? యాఁకఁ గొనెనో ?
యకట! జరిగినఁ దడ వేల ననుచునుండె. ౧౦౨

గీ. తలఁచు చెట్టులు దడవుకుఁ దాళలేక
నచ్చుచుండెను దారిలో వారిఁ జూచి
మోమునందున నగవులు మొలకలెత్త
బలికె వారిని దాపేటి బల్లిదుండు. ౧౦౩

క. ఓయయ్యలార! మీరలు, పోయినకార్యంబు సాగి పోయెనె తుదకున్
దాయం జనఁ గా మీరలు, పోయంబడెఁ బాలధార పొట్టయు నిండెన్.

క. చేరఁడు స్థానంబునకని, గారవ మెదుగంగఁ బలికె కైతవ మేదన్
వారికి వెన్నంటియుఁదా, జేరఁగ నడువంగఁ ద్రోవఁ జేరియు వానిన్.

నేల వేడెప కిదగా నే నేదొ చెప్పుదు
మీరు బుద్ధిని నూహించి మేలు గనుఁడు. ౧౨౦

ద్వి. అని చెప్పి చిత్రాంగు నపుడు జూచుచును
వినయంబుతోఁ బల్కె వీనులు నిండ. ౧౨౧

చ. మృగయుఁడు జూడకుండఁగను మెల్కువతోడుత నేగి ముందుగా
వగపును మాని యొత్తిగిలి వాడుకవచ్చెడి వానిత్రోవలోన్
సొగసుగ చెర్వుగట్టునను సొమ్మసిలం బడియుండ నీదుపై
మృగయునిరాకఁ జూచుచును మేలొనరింపఁగ నీదుకన్నులన్. ౧౨౨

చ. పొడుచుచు నుండు వాయసము పొంచియు నుండెద నేను నచ్చటన్
కడువడి నీదుయాకృతిని గన్గొని వచ్చి మెకం బటంచు వా
డుడుగక నిన్ను బట్టుటకు నుర్విని మంధరుతోడ విల్లునుం
బడ గను వీడి వేగమునఁ బాఱును నీకడఁ జేరఁగా వెసన్. ౧౨౩

ఉ. వెంటనె వానిబంధమును వేగమె చప్పుడు సేయకుండఁగా
పంటనె నొక్కి వేయుదును బాఱును నాతఁడు నీటిపట్టుకున్
వెంటనె నేను దూరెదను వేగమె బొక్కను మీరు బాఱుడీ
తంటయుఁ దీరు నంతటను దాఁ జెడు వ్యాధుఁ డుపాయ మిద్దియే. ౧౨౪

క. అనవుడు విని చిత్రాంగుడు, ఘనుఁడగులఘుపతనకుఁడును ఘనబుద్ధిని నా
ఘనుఁడగుహిరణ్యకుని గని, ఘనమగు నీబుద్ధియంచుఁ గడగెను బొగడన్.

గీ. నీవు చెప్పు నుపాయంబ నిజము యనుచు
నటులు జరుపఁగ నాహిరణ్యకుఁడు నపుడె
తనదు కార్యంబు జరిపియుఁ దరలె నిక్క
మృగయుఁ డేగెను దిగులొంది మెల్లఁగాను. ౧౨౫

గీ. కాన నీకథ వినినను గల్గు సుఖము
మైత్రి వెరవును గల్గును మాన్యుడగును

చెవులఁబడఁగానె దానికిఁ జేతఁ గలుగు
చేతగలిగిన గలుగదె శ్రేష్ఠఫలము.

సీ. వేంపటాన్వయమందు వెలసెను విప్రుండు
వేదవేత్తయు స్వామివిదుషుఁ డిలను
వానికి జనియించె వాసిగ నాగమాం
బికగర్భశుక్తిమౌక్తిక మనంగ
నిలఁ గుటుంబుండను నీనామమును గొని
సార్థకంబనుచును సరసులనఁగ
వానిచేతను జేయబడియె నీగ్రంథంబు
వాసికెక్కుచు నిల వఱలు గాత.

గీ. వసుధ సూర్యుఁడు చంద్రుఁడు వఱలుదనుక
పసను జూపుచుఁ బఠియించు నిసువులకును
విసువు లేకుండ వీనుల విందుగొల్పి
గుణము గల్గించి వారిదుర్గుణము వాపి.

గీ. పరఁగు నింగ్లీషుశకకాల సరణియందు
వహ్ని నేత్రనందేందుని వత్సరమున
మార్చియను పేరమాసంబు మసలుచుండ
మాన్యమగుచును నీగ్రంథమహిమ వెలసె.

గద్య. ఇది శ్రీవేంపటాన్వయ పయః పారావారరాకాసుధాకరుండగు
చినస్వామిశాస్త్రికి నాగమాంబాగర్భశుక్తిముక్తాఫలుండును,
శ్రీశైలభ్రమరాంబికా సహిత మల్లికార్జున వరప్రసాద
లబ్ధవరుండును నగు కుటుంబయ్యశాస్త్రిచే రచి
యింపంబడిన మృగకూర్మముల మోక్ష
ణంబను చతుర్థగుచ్ఛము

